4.11.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 66. సంచిక: 43. విడిప్రతి : రు. 2.00లు Phone : 27354 Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



## పివి బెత్తం ఆడించకుంటే జిల్లాలో కాంగ్రెస్ కొంపకు నిప్పు ఖాయం!

# టిక్కెట్లు రాకుంటే తిరుగు బాటుకు రెడీ?

**వెంకటగిరిలో వేమారెడ్డి, రాపూరులో గౌడ్, గూడూరులో రామచంద్రయ్య, ఉదయగిరిలో జానకి రాం స్వతంత్రులుగా పోటీ చేస్తారా?**

జిల్లాలో అసెంబ్లీ టిక్కెట్ల సమరం రంజుగా తయారౌతూంది. ఢిల్లీలో ఇటు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి ఒంటరిగా పోరాడుతుంటే; అటు మాగుంట, పెళ్లకూరు, జెక్, వేమారెడ్డి ఇత్యాది సకల సబ్బంగ నాయక గణం మూకబలంతో టిక్కెట్లను జవురు కోవడానికి గజకర్ణగోకర్ణ టక్కుటమార విద్యలన్నీ ప్రదర్శిస్తున్నారు.

ఈ సంచిక పాఠకులకందే నాటికి ఏఐసిసి నుంచి అభ్యర్థుల జాబితా వెలువడవచ్చు. అందువల్ల ఈ దశలో ఎవరెవరికి ఏఏ స్థానాలు లభించనున్నాయన్న వూహలు చేయడం వ్యర్థం. అయితే టిక్కెట్ల ప్రయత్నంలో నాయకులు పడుతున్న పాట్లు మాత్రం జిల్లా కాంగ్రెస్‌లో కొత్తగా వ్యాపించిన విష సంస్కృతికి అద్దం పడుతున్నాయి.

జనార్దనరెడ్డి షరామామూలుగా ఆ మూల సౌధంలో అంతఃపుర అంతర్భాగంలో ఆసీనుడై గుంభనంగా తన ప్రయత్నం తాను చేసుకపోతున్నారు. ఆయన ఎవరితో మాట్లాడుతున్నాడో, ఏమి మాట్లాడుతున్నాడో, ఎవరి పేర్లు చెప్తున్నారో పోల్చి పొక్కడం లేదు. ప్రధాన మంత్రిని అసలు కలిశాడో లేదో, కలిస్తే టిక్కెట్ల విషయం మాట్లాడాడో లేదో కూడా తెలియడం లేదు. ఆయన వైపునుంచి ఎవరిపైనా ఎటువంటి వ్యాఖ్యలూ విన్పడడం లేదు. మేము వూహించ గల్గినంత వరకు జనార్దనరెడ్డి ప్రతిపాదించే అభ్యర్థులు వీరుగా వుండవచ్చునిపిస్తున్నది.

నెల్లూరు శ్రీ చేవూరు దేవకుమార్ రెడ్డి; కోవూరు శ్రీ పివి ప్రసన్నరెడ్డి; సర్వేపల్లి - శ్రీ సి.వి. శేషారెడ్డి; రాపూరు- శ్రీ ఆనం రామనారాయణరెడ్డి; గూడూరు - శ్రీ పట్రా ప్రకాశరావు; సూళ్లూరుపేట- శ్రీ పసల పెంచలయ్య; వెంకటగిరి- తాను; ఆత్మకూరు - డాక్టర్ బి. సుందరరామరెడ్డి; ఉదయగిరి- శ్రీ మాదాల జానకిరాం లేదా ఒక మైనారిటీ నాయకుడు; కావలి - శ్రీ కలికి యానాదిరెడ్డి; అల్లూరు - శ్రీ సామంతు సుబ్బారెడ్డి లేదా శ్రీ వేముల ఆదిశేషయ్య. ఇది కేవలం మా వూహ మాత్రమే. సాధారణంగా ఆయన ఆలోచనా ధోరణి ఈ రూపంలోనే వుండాలి- పరిస్థితులు ప్రతికూలించి కొత్త కొత్త పేర్లు రంగంలోకి తేవలసివస్తే చెప్పలేము. నెల్లూరులోనే లేక మరొక చోటకో ఒక లేడి డాక్టర్‌ను పెట్టే ఆలోచన వున్నట్లు సందేహం కల్గుతున్నది; చెప్పలేము. మాగుంట వారి అభ్యర్థిగా శ్రీ పివి ప్రసన్న రెడ్డిని కోవూరులో నిల్పాలన్నది మొదటి నుంచీ ఆయన వాదం. గత ఉప ఎన్నికలో పెళ్లకూరు కోసం ఆ నియోజక వర్గంలో సుబ్బరామరెడ్డిగారు చాలా శ్రమ పడ్డారు కాబట్టి, పరిచయాలు, బంధుత్వాలు పెంచుకున్నారు కాబట్టి, డబ్బు మంచి నీళ్లలాగా ఖర్చు పెట్టివున్నారు కాబట్టి ఇప్పుడు తిరిగి వారికే అవకాశమిస్తే కాంగ్రెస్‌ను గెల్పించుకొని వస్తారన్నది జనార్దనరెడ్డి వాదం. అది వీలుకాని స్థితిలో అక్కడ దేవకుమార్ రెడ్డికి టిక్కెట్టు ఖాయం. నెల్లూరులో మాగుంట అభ్యర్థిని నిలబెట్టడం ఆయనకు సుతరామూ గిట్టక పోవచ్చు. దేవకుమార్ రెడ్డికి నెల్లూరు టిక్కెట్ తేవడం కష్టమయ్యే పక్షంలో ఎవరిని ప్రతిపాదిస్తాడన్నది వూహ కందడం లేదు.

సర్వేపల్లి, గూడూరు, వెంకటగిరి, రాపూరు, సూళ్లూరు పేటలలో ఆయనకు రెండు అభిప్రాయాలు లేవు. కావలి, ఆత్మకూరు ఎమ్మెల్యేలిద్దరూ తనను మధ్య మధ్యలో వదలి ఎదురింటి తలుపుతట్టి వచ్చినా జనార్దనరెడ్డి వారిని వదలి పెట్టక పోవచ్చు. ఉదయగిరి జానకిరాం జనార్దనరెడ్డి లైన్‌లోనే వున్నట్లు బహు నేర్పుగా నటిస్తూనే, మాగుంట వారి శుశ్రూషచేస్తూ, స్తోత్ర పాఠాలు జపిస్తున్నాడు. అయినా జనార్దనరెడ్డికి అక్కడ రాజమోహన్ రెడ్డి కంటె జానకిరాం తేలికపాటి శత్రువు. అల్లూరు విష్ణు అనవసరంగా మనస్పర్థలు పెంచు కున్నాడు. అందువల్లే

కొరవ 8 పేజీలో

# సర్వేలు మరీ గందరగోళం సృష్టిస్తున్నాయి!

రాష్ట్రశాసన సభ ఎన్నికలకు నామినేషన్ల పర్వం మొదలైంది. వచ్చే నెల ఒకటి, అయిదు తేదీల్లో శాసన సభ ఎన్నికలు పూర్తవుతాయి. ఎన్నికలు దగ్గర పడుతున్న కొద్దీ ఆయా పార్టీల్లో విభేదాలు ముదిరి పాకాన పడుతుండడంతో వచ్చే ఎన్నికల్లో ఏ

**ఆంధ్రజ్యోతి సర్వేలో తెలుగుదేశం ఆధిక్యత**

పార్టీ అధికార పీఠంపై కూర్చుంటుందో స్పష్టంగా చెప్పలేని పరిస్థితి నెలకొనివుంది. రాష్ట్రంలో జయాపజయాల్ని అంచనా వేయడానికి అనధికారికంగా రకరకాలు సర్వేలు జరిగాయి. రాష్ట్ర, కేంద్ర ఇంటలిజెన్స్ వర్గాలు కూడా తమ అంచనాల్ని ప్రభుత్వ అధినాయకులకు అందించాయి. ఇంటెలిజెన్స్ అంచనాల ప్రకారం కాంగ్రెస్‌కుగానీ, తెలుగు దేశంకుగాని స్పష్టమైన మెజారిటీ లభించడంలేదు. అయితే ఆంధ్రజ్యోతి దినపత్రిక తన సిబ్బంది సహాయంతో చేయించిన అనధికార సర్వేలో 'దేశం' వైపు మొగ్గు కనిపించిందట. కాంగ్రెస్‌పై అభిమానమున్న యాజమాన్యం కాబట్టి ఆ సర్వేను తుంగలో తొక్కినట్లుంది. ఈనాడు పత్రిక కూడా ఎడిషన్ల వారీగా అనధికార సర్వే జరిపింది. అయితే ఆయా పార్టీల అభ్యర్థులు ఖరారు కాకముందు పార్టీ ప్రాతిపదికగా ఈ సర్వే జరిగింది. ఈనాడు పత్రిక సర్వేలో 'గాలి' అంటూ ఏదీ లేదని స్పష్టమైందట. జయాపజయాలు పార్టీ ప్రాతిపదికన కాకుండా అభ్యర్థి బలాబలాలపై ఆధారపడి వుంటాయని ఈనాడు సర్వేలో వెల్లడైందట. 'మార్గ' సంస్థ జరిపిన సర్వేలో కాంగ్రెస్‌కు అధికశాతం సీట్లు రావచ్చునని తేలింది. అయితే కాంగ్రెస్ తిరిగి అధికారంలోకి వస్తుందా? రాదా? అన్న విషయమై ఈ సర్వే నోరు మెదపలేదు. మొత్తంమీద ఎన్నికల జయాపజయాలు అగమ్య గోచరంగా వున్నాయనడంలో సందేహం లేదు. ఈ నేపథ్యంలో ఆయాపార్టీలు టిక్కెట్ల పంపిణీని పూర్తి చేసుకుంటున్నాయి. సహజంగానే టిక్కెట్ల పంపిణీలో అన్ని పార్టీల్లో కూడా అసంతృప్తి తలెత్తి సిగపట్లకు రంగం సిద్ధమైంది. ప్రధాన పార్టీలైన కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలలో టిక్కెట్ల కోసం ఈమారు పోటీ బాగా

**ఈనాడు సర్వేలో ఏ పార్టీకీ గాలి తోలడం లేదన్న నిజం**

వుండింది. ఒక్కో నియోజక వర్గానికి ముగ్గురికి నుంచి అభ్యర్థులు టిక్కెట్లు ఆశించడం. అందులో ఎవరో ఒకరికి టిక్కెట్టు రావడం, మిగతావారు భంగపడడం జరుగుతోంది. టిక్కెట్టు వచ్చినవాడు ఎన్నికల్లో గెలవకుండా కాళ్లు పట్టుకొని కిందకు లాగేందుకు 'భంగపడ్డ తమ్ముళ్లు' కత్తులు, కటార్లు సిద్ధం చేసుకుంటున్నారు.

* * *

కాంగ్రెస్‌లో టిక్కెట్ల వడ్డనకు పివి సిద్ధమౌ తున్నారు. డిసిసి నుంచి, సెంట్రల్ ఎలక్షన్ కమిటీ వరకు పలు రకాల కమిటీలు తమ రుచులకు, అభిరుచులకు అనుగుణంగా తీపి, ఉప్పు, కారం, చేదు రంగరించి, పాకంపట్టి వండిన టిక్కెట్ల వంటకాన్ని వడ్డించ డానికి ప్రధాని పళ్లాలు, గరిటలు సిద్ధం చేసుకొంటున్నారు. వంట వండడంలో తమ వాళ్ళు, తమకు గిట్టని వాళ్ళు వుండినా, వడ్డించే వాడు మాత్రం ఒకడే కావడంతో అభ్యర్థులకు పిచ్చి పట్టినట్లుగా వుంది. అమృతం పంచడానికి మోహినీ అవతార మెత్తిన విష్ణు పరమాత్మ వలె పివి జాబితాలన్నీ చేత పట్టుకొని వున్నా, దాన్నందుకొనే దేవత లెవరో, మోసపోయే దానవులెవరో అంతు చిక్కడం లేదు. ఇప్పటి వరకు పివిని కలిసి, తమ అభ్యర్థన విన్పించి, తమ టిక్కెట్ల కోరికలు కోరి అసంతృప్తితో వెనుదిరిగి వచ్చిన వారు లేరు; తమ 'వంతు' తీరుతుందన్న ధైర్యంతో నిబ్బరంగా వుండ గల్గుతున్న వారూ లేరు. అంత చాకచక్యంగా వ్యవహరిస్తున్నారాయన. తన వద్దకు వచ్చే వారినందరిని ఆదరంగా పలుకరిస్తున్నారు; చెప్పే వన్నీ వింటున్నారు; చూస్తామని నమ్మ బలుకు తున్నారు; చేస్తానని మాత్రం ఎవరికి చెప్పడం లేదు. రోజూ తనను కలువవచ్చే రాష్ట్ర నాయకులతో ఓపికగా

**మార్గ్ సర్వేలో కాంగ్రెస్‌కు అధిక సీట్లు అవకాశం**

చర్చించడంతో పాటు, మంగళ వారం ఉదయం 11 గంటల నుంచి సాయంత్రం 4 గంటల వరకు ఆంధ్రకు సంబంధించిన, అభ్యర్థిత్వం ఆశ కల్గిన 350 మందిని పివి స్వయంగా పలుక రించారు. వారిలో దరఖాస్తు పెట్టి అదృష్టం పరీక్షించుకో జూస్తున్న అనామక కాంగ్రెస్ కార్యకర్తల నుంచి వాడెంద్ల భాస్కర రావు వంటి రాష్ట్ర నాయకుల వరకు

కొరవ 8 పేజీలో


బస్‌లో నుంచి ఈతగాళ్లు తేవుకొచ్చిన ఒక పసి పిల్లవాడి శవాన్ని ఒడ్డుకు తీసుకొని వస్తున్న పోలీసు సిబ్బంది

## జిల్లాకు తుఫాన్ ప్రళయం తృటిలో తప్పినా...


శవాలున్నింటినీ వరుసగా రోడ్డుపైన పరుండబెట్టిన హృదయ విదారకదృశ్యం.

# జలవిలయంలో 40 ప్రాణాలు నీళ్లపాలు!

నవంబరు నెల వస్తున్న దంటేనే నెల్లూరుకు వణుకు పుడుతుంది. ప్రకృతి తన ప్రకోపాన్ని ప్రదర్శించే సమయం కదా? అక్టోబరు 31 తేది అటువంటి తుఫాన్ ప్రళయపు అంచువరకు వెళ్ళి, వెంట్రుక వాసిలో తప్పించు కున్నది నెల్లూరు జిల్లా. బంగాళా ఖాతంలో పుట్టిన వాయుగుండం, పెను తుఫాన్‌గా మారి, మహా ఉధృతంతో జిల్లా పై విరుచుక పడబోయి, చివరి క్షణంలో మనసు మార్చుకొని, మద్రాసు దగ్గర ఆగిపోయి, ఆ నగరపు భరతం పట్టింది. కలెక్టరేట్‌కు చేరిన తుఫాన్ హెచ్చరికలు వింటుంటే 1979 మే నాటి మహా ప్రళయం మరొక సారి ముంచ బోతున్నదనే అన్పించింది. ఆ ప్రళయాన్ని తప్పించు కున్నా అదే సమయంలో జల విలయాన్ని చవి చూడాల్సి రావడం దురదృష్ట కరం. 31 తేది రాత్రి వంటి గంటకు గూడూరు టౌన్ ఉత్తర పొలిమేరలోని పంబలేరు కాజ్‌వేను దాటబోయి బోల్తాపడి, 39 మందిని జల సమాధి చేసింది ఒక టూరిస్టు బస్సు. విచిత్రము, విషాద కరమూ అయిన ప్రమాదమిది. తుఫాన్ ప్రమాదం తప్పిందని వూపిరి పీల్చుకుంటుండిన వారంతా ఈ బస్సు ప్రమాద ఘోరం చూసి విచలితులై పోయారు.

* * *

31 తేది వేకువన మద్రాసు నగరం మీదుగా తీరం దాటిన తుఫాన్ కొద్ది నష్టం కల్గించి నప్పటికీ, జిల్లాకు వ్యవసాయ పరంగా మేలే చేసింది. అది మరొక పది నిముషాలు ఉత్తరంగా ప్రయాణించి తీరం దాటి వుంటే నెల్లూరు అతలా కుతలమై పోయి వుండేది. 200 కిలో మీటర్ల వేగంతో భూమిని చేరిందా తుఫాన్ రక్కసి. దాని ప్రభావం మద్రాసు నుంచి సూళ్లూరుపేట వరకు వుండింది. తడ, సూళ్లూరుపేటలలో అసంఖ్యాకంగా చెట్లు పడిపోయాయి. తీగలు తెగి పోయాయి. రోడ్లు సర్వ నాశనమైనాయి. రైలు పట్టాల పై కూడా చెట్లు విరిగి పడి, వరద నీళ్లు పారి రైళ్ల రాకపోకలు స్తంభించాయి.

అయితే అదృష్టవశాత్తు ఎక్కడా ప్రాణ నష్టం లేదు. వాగులు, వంకలు పొర్లి ప్రవహించడంతో నీటి కరువు తీరిపోయింది.

తీరం దాటిన తుఫాను ఉత్తరంగా, కోస్తా తీరం వెంబడే, నేల మీదుగా శరవేగంతో ప్రయాణించడం ఈసారి విశేషం. అది ఆ స్పీడులో




శవాలను లారీకెక్కిస్తున్న పోలీసులు, అంత మందిని పొట్టన పెట్టుకుని ఏమెరుగని అమాయకురాలి వలె నింపాదిగా పారుతున్న పంబలేరు

## రాళ్లపాడు చెరువు సర్వనాశనం

విశాఖ పట్నం వరకు వెళ్ళిన తర్వాత కాని బలహీన పడలేదు. దీని ఫలితంగా 31, 1 తేదులలో జిల్లాలో కుంభవృష్టి కురిసింది. అన్నిటి కంటె ఎక్కువగా కలిగిరిలో ఆ ఒక్కరోజు దాదాపు తొమ్మిది పదున్ల వాన (212 మి.మీ) పడింది. పెన్నతో సహా జిల్లాలోని అన్ని నదులు, వాగులు, వంకలు గట్లు పరుసుకొని పారాయి. సోమశిలకు కొత్తగా నీరు వచ్చి నిల్చింది.

దాదాపు 14 చెరువులకు గండ్లు పడ్డాయి. కండ్లేరు డ్యాం కుడి తట్టు, మట్టి కట్టకు గండి పడింది. 70 టిఎంసిల నీరు నిల్వచేయ వలసిన ఈ బృహత్తర రిజర్వాయర్ ఇంత చిన్న వానకే గండ్లు పడి, కట్టలు తెగేంత బలహీనంగా వుంటే రేపు అంత నీరు నిల్చినప్పుడు ఎటువంటి భయంకర ప్రమాదాలు సంభవిస్తాయో! పిడబ్ల్యుడి ఇంజనీర్లు తమ అవినీతి కక్కుర్తికి ప్రజల డబ్బును దిగమ్రింగడమే కాదు - ప్రజల ప్రాణాలకూ ఎప్పుడో ముప్పు తెచ్చేట్లున్నారు.

గండ్లుపడిన చెరువులివి - అన్నమేడు, చౌడవరం, చాకలి కొండ, తమిద పాడు, పెద్ద అనె పట్నం, కలిగిరి, గుండె మడకల, వరికుంటపాడు, కొండ్రెడ్డి పల్లి, గువ్వాడి, ఎల్లంరెడ్డి పల్లి, కొండ్రాజు పల్లి, ఇస్కపల్లి, తోటల చెరువు పల్లి.

మరొక విశేష నష్టం - ఒంగోలు జిల్లా రాళ్లపాడు చెరువుకు గండ్లు పడడం. ఇది వుండడానికి ఒంగోలు జిల్లాలో వున్నా, నెల్లూరు సరిహద్దులోని చాలా గ్రామాలు ఈ చెరువు పై ఆధార పడి వ్యవసాయం చేస్తున్నాయి. ఒంగోలు జిల్లాలోని అతి పెద్ద చెరువిది. అంతంత పెద్ద కట్టలు మూడ చోట్ల తెగాయి. ఒక గండి అయితే ఫర్లాంగు దూరం కనుక పోవడంతో పాటు, 80 అడుగుల లోతు అఘాతం సృష్టించింది. దాన్ని పూర్చడం బ్రహ్మ ప్రయత్నమే.

ఎమ్మెల్యే శ్రీ మహీధర్ రెడ్డి ఇందులో చేప పిల్లలు వదలి పెట్టాడని, కలుజు చెక్కలు ఎత్తితే అవి జారి పోతాయని సందేహించి, ఎమ్మెల్యే ఆగ్రహానికి గురి కావలసి వస్తుందనే భయంతో నీటి పారుదల శాఖ అధికారుల కలుజు చెక్కలు ఎత్త లేరట. ఫలితంగా నీళ్లు కట్టల మీదుగా పొంగి, పారి, ఇంత ప్రమాదం జరిగి పోయింది. ఆ చెరువును మళ్లీ యథా స్థితికి తేవాలంటే కోటి రూపాయల పైన ఖర్చవుతుందని అంచనా.

సూళ్లూరుపేట, ఇతర కొన్ని చోట్ల కొద్ది సంఖ్యలో గుడిసెలు కూలడం జరిగింది. ఎక్కడికక్కడ ఎమ్మార్వోలు బియ్యం, వగైరా పంచి సరి పెట్టేశారు.

* * *

## వారికి చావు వ్రాసిపెట్టి వాగులో దిగిందా బస్సు!

గూడూరు టౌన్ సరిహద్దుల్లో జరిగిన బస్సు ప్రమాదం కథ వింటే ఎటువంటి వాడికీ కళ్ళు చెమ్మ గిల్లడంసహజం. అంత ఘోరంగా, విషాద కరంగా వుందా దుర్ఘటన. 31 తేది రాత్రి ఒంటి గంటకు పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు నుంచి ఒక టూరిస్ట్ బస్ తిరుపతికి వెళ్తూ పంబలేరు వాగులో బోల్తా పడింది. ఆ డ్రైవర్‌కు వెంకటగిరి మీదుగా వెళ్లడం అలవాటట. బస్సుకు ముందుగా ఒక ట్యాంకరు పంబలేరు కాజ్‌వే దాటుకొని వెళ్ళిందట. ముందు వెళ్లే లారీని చూడడం తప్ప, వాగు ఉధృతంగా ప్రవహించడం బస్ డ్రైవర్ గమనించలేదు. చీకట్లో కన్పించినట్లు లేదు. అదేదో మామూలు నీటి ప్రవాహమను కున్నాడట. ట్యాంకర్ వెనుకనే బస్‌ను వాగులోకి దింపాడు. ఆ కాజ్‌వేకి అటు, ఇటు చేపట్టు గోడలు లేవు. కనీసం అంచును సూచించే కమ్ములు కూడా లేవు. వాగు మధ్యలోకి వచ్చే సరికి ఒక చక్రం కాజ్‌వే అంచు నుంచి జారి, గుంటలో పడింది. బస్ చక్రాలు మూడడుగుల లోతుకు దిగి పోయాయి. నీళ్లు సైలెన్సర్‌లోకి పోయి ఇంజన్ ఆగి పోయింది. గుంట నుంచి వెలికి తీయడం డ్రైవరు తరం కాలేదు. నీటి ప్రవాహ వేగానికి కన్ను మూసి తెరిచే లోపల బస్ కాస్త బోల్తా పడి పోయింది.

అర్ధరాత్రి కావడంతో లోపలున్న ప్రయాణీకులంతా మంచి నిద్రలో వుండినారు. బయట వాన పడుతుండి నందువల్ల కిటికీ అద్దాలన్నీ బిగించి వుండినాయి. బస్సు బోల్తాపడి, నీళ్లు వంటికి తగిలే వరకు లోపలున్న వారికి ప్రమాదం సంగతి అర్థం కాలేదు. కల మేలుకొన్న వారు ఉలిక్కి పడి లేచి వెలికి రాబోతే, కిటికీ అద్దాలు అడ్డు తగిలాయి. ఏమి చేయాలో ఆలోచించుకునే లోపలే అందరూ జల సమాధి అయిపోయారు. కొందరు మాత్రం డ్రైవర్ సీటు ప్రక్క నుంచి బస్ టాప్ పైకెక్కి ప్రాణాలు కాపాడు కున్నారు. వారిలో కొందరు ప్రాణాలకు తెగించి, నీటి వేగాన్ని నిలువరించు కుంటు బస్‌లోపలున్న వారిని బయటకు లాగారు. ఇంకొందరు అద్దాలు పగుల గొట్టి, నీళ్లలో దూకి ఈదుకొంటూ వడ్డుకు చేరారు.

కాని ఎంత ప్రయత్నించినా 39 మంది బస్ లోపలే నీటి కాపానికి

కొరవ 7 పేజీలో

# ఆచరణ సాధ్యమా?

రాష్ట్ర శాసన సభ ఎన్నికలకు కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు రెండూ మెనిఫెస్టోలు ప్రకటించాయి. మన దేశంలో రాజకీయ పార్టీల ఎన్నికల ప్రణాళికలకు ఎప్పుడో విలువ గతించింది. వాటినొక లాంఛనంగా మాత్రమే పరిగణిస్తున్నారు - ఇటు నాయకులు, అటు ఓటర్లు కూడా! పార్టీలు ప్రకటించే ప్రణాళికలు చదివి, అర్థం చేసుకొని, ప్రభావితులై ఓటు వేసేంత చైతన్యం మన ప్రజల్లో ఇంకా రాలేదు. మెనిఫెస్టోలలో ప్రకటించే అంశాలు అధికారంలోకి వచ్చిన తర్వాత గుర్తు పెట్టుకొని, ఆచరించడానికి ప్రయత్నించేంత చిత్తశుద్ధి మన రాజకీయ పార్టీలు వేటికీ లేదు. ఎప్పటికప్పుడు ఏదో ఒక గాలివాటంతో, కొత్త మోజుతో కొట్టుకపోవడం ఓటర్లకు అలవాటై పోయింది; పరిస్థితుల కనుగుణంగా ఏదో ఒక ఉద్రేక పూరితమైన నినాదాన్ని, వివాదాన్ని సృష్టించి ఓటర్లను ఆకర్షించి అధికారంలోకి రావడం రాజకీయ పార్టీలకూ మామూలైపోయింది. ఎన్నికల ప్రచార పర్వంలో విధాన పరమైన నిర్ణయాలు, వాగ్దానాలు, విమర్శలు అదృశ్యమై తిట్లు, శాపనార్థాలు, లంచాల ఆరోపణలు అగ్రతాంబూలం అందుకుంటు న్నాయి.

ఈ దృష్టితో చూసి నప్పుడు ఉభయ పార్టీల మెనిఫెస్టోలను పట్టించుకోవలసిన అవసరం లేదు. కాని, రెండింటిలో చోటు చేసుకున్న రెండు వాగ్దానాలు ఓటర్లను ఆకర్షి స్తున్నాయి; చర్చకు ఆస్కారం కల్పిస్తున్నాయి. వాటిలో మొదటిది సబ్సిడీ బియ్యం, రెండవది సంపూర్ణ మద్యనిషేధం.

తాను అధికారంలోకి వస్తే ఇంటికి పాతిక కిలోల వంతున రెండు రూపాయల ధరకే బియ్యం పంచుతానని ఎన్టిఆర్ ప్రకటించారు; అధికారం చేపట్టిన ఇరవై నాలుగు గంటలలో మద్యం నిషేధిస్తానన్నారు! దీనికి ప్రతిగా కాంగ్రెస్ ఇంటికి పదికిలోల వంతున బియ్యం ఉచితంగా పంచుతామని, జనవరి 1తేది నుంచి సంపూర్ణ మద్యనిషేధం అమలు చేస్తామని వాగ్దానం చేసింది. ఇవి రెండూ ఆచరణకు సాధ్యమయ్యే వాగ్దానాలేనా?

రాష్ట్ర రాజకీయాలలో అత్యంత ప్రాధాన్యత సంతరించుకున్న అంశాలివి. 1983లో అప్పటి పరిస్థితులకను గుణంగా ఎన్టీ రామారావు రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం ప్రకటించారు. ఆరోజు మార్కెట్‌లో బియ్యం ధర రు.4లు మించి లేదు. ఎఫ్‌సిఐ మద్దతు ధర ప్రకారం సేకరించిన లెవీ బియ్యం నుంచి రాష్ట్రం కొంత కోటా తీసుకొని ఈ పథకం అమలు చేసింది. అప్పట్లో దీనివల్ల ప్రభుత్వంపై వంద కోట్లలోపే భారం పడింది. కాని ఇప్పటి పరిస్థితి వేరు. మార్కెట్‌లో బియ్యం ధర గణనీయంగా పెరిగింది. ఎఫ్‌సిఐ లెవీ బియ్యమూ పెరిగాయి. ఈరోజు ఆ పథకం అమలు చేయాలంటే ఏటా వెయ్యికోట్లు ఖజానా నుంచి తరలించాలి. అంత డబ్బు రాష్ట్ర ప్రభుత్వం ఏ వనరులనుంచి సేకరించగల్గుతుంది? ఆనాడు సబ్సిడీ బియ్యం పథకం అమలు చేయడానికి ఎన్టీ రామారావు గారు వైన్సుషాపును బంగారు గనిగా భావించి, వారుణ వాహిని పేరుతో సారా త్రాగడాన్ని ప్రోత్సహించి 700 కోట్ల ఆదాయాన్ని పెంచారు. రూపాయిగా వుండిన సారా పొట్లం ధరను ఏడు రూపాయలకు పెంచి బియ్యం ఖర్చుకు పైసలు పెతుక్కున్నారు.

కాని ఇప్పుడు బియ్యం పథకం కొనసాగిస్తూనే, మద్యనిషేధం పాటిస్తామని రెండు పార్టీలూ ప్రకటిస్తున్నాయి. మొదటి దానివల్ల వెయ్యికోట్లు ఖర్చు పెరిగితే, రెండవ దానివల్ల వెయ్యికోట్ల ఆదాయం లోపిస్తుంది. ఈ లోటును ఏ రూపంలో పూడ్చు కుంటారో రెండు పార్టీలూ చెప్పడం లేదు. ఎన్టీఆర్ ఏడేళ్ల పాలనలో సబ్సిడీ బియ్యంకోసం రోడ్లు, నీటి ప్రాజెక్టులు, విద్యుత్ కర్మాగారాలు వంటి వాటికి నిధులు నిల్పివేసి పారిశ్రామికంగా, వ్యావసాయిక పరంగా రాష్ట్రాన్ని అధోగతి పాల్జేశారు. రాష్ట్రం మొత్తం ఆరేడేళ్లకు పైనుంచి చీకట్లో కొట్టు మిట్టాడుతున్నది. ప్రపంచ బ్యాంకు పుణ్యమా అని చెన్నారెడ్డి ప్రయత్నంతో ఏడువందల కోట్లు ఒక్కసారిగా వచ్చి రోడ్లను బాగుపరిచాయి కాని, లేకుంటే ఆంధ్రప్రదేశ్ రవాణా విషయంలో ఆదిమ కాలం నాటికి నెట్టబడి వుండేది. తెలుగు గంగ వంటి ప్రాజెక్టులు కూడా నిధులు లేక నత్తనడక నడిచాయి. ఈ చేదు అనుభవాన్ని



విస్మరించి ఇప్పుడు రెండు పార్టీలూ ఓట్ల ఆకర్షణ కోసం ఇంతింత పెద్ద వాగ్దానాలు చేయడం ఆశ్చర్యం కల్గిస్తున్నది.

కేవలం ఆదాయం దృష్ట్యానే కాకుండా, పాలనా పరంగా కూడా సంపూర్ణ మద్య నిషేధం ఆచరణ సాధ్యమా అన్నది ప్రశ్న. మహిళా ఉద్యమం నుంచి వస్తున్న వత్తిడిని తట్టుకోలేక, మహిళల ఓట్లు కోల్పోవలసి వస్తుందేమోనన్న భయంతో ఈ వాగ్దానం చేస్తున్నారు. కాని, మద్య నిషేధాన్ని కఠినతరంగా అమలు చేయడం సాధ్యమా? మద్యపానం ఒక సాంఘిక వ్యసనం. తరాల తరబడి ఆ దుర్వ్యసనానికి బానిసలైన వారు ప్రభుత్వం అమ్మకాలు ఆపినంత మాత్రాన రాత్రికి రాత్రి మారరు, మారలేరు. దీనివల్ల దొంగ సారా, కల్తీ మద్యం వ్యాపారాలు విచ్చలవిడిగా పెరిగిపోతాయి. వాటిని నివారించడానికి చాలా పటిష్టమైన, నిజాయితీ, చిత్తశుద్ధి కల్గిన అధికార యంత్రాంగం కావాలి. మద్యమైతే నిషేధించగలరుకాని, నిజాయితీ పరులైన అధికార బలగాన్ని ఎక్కడ నుంచి తేగలరు? సారా నిషేధించినంత వరకు ఉధృతంగా పోరాడిన మహిళా కార్యకర్తలు, ఆ తర్వాత దొంగసారా, చీప్ లిక్కర్ అక్రమ వ్యాపారాలపై యుద్ధం నడపడంలో నిరాసక్తత చూపించారు. మద్య నిషేధాన్ని ప్రతి మహిళా స్వాగతించి తీరుతుంది; కాని, దాని అమలులో ఆమె నిర్వహించే పాత్ర కొంచమే! అందువల్లనే ఇది ఆచరణ సాధ్యమయ్యే వాగ్దానమా అని సందేహించవలసి వస్తున్నది.

కేవలం ఓట్లు రాబట్టుకోవడం కోసం రెండు ప్రధాన పార్టీలూ ఇటువంటి వాగ్దానాలు చేసి రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను, పాలనా పరిస్థితులను ఎంత అస్తవ్యస్తం చేయనున్నాయోనన్న ఆందోళన కల్గుతున్నది.

జమీన్‌రైతు

3-11-1944

పేజీలు : 8 వెల : 0-1-6

## నెల్లూరు ముచ్చట్లు

ధాన్యంధరలు: ఇది చాలా అక్రమంగా వుంది. రైతులు బియ్యం చేయించి యిస్తే పుట్టి 1 కి 145 లు గిడుతున్నది. ధాన్యంగా యిస్తే రు142 లు మాత్రమే గిడుతుంది. ఇప్పుడు కొత్త మెకువకటి దిగింది. రైతులు తమంతట తాము యిస్తే సైరేటు. అట్లాగాక అధికారు రిక్వీజిషన్ చేస్తే 131 రూపాయలేనట. అదీ అక్విజిషన్ చేస్తే మళ్ళీ కొంత తగ్గుతుందట. రాను రాను ఆహారోత్పత్తి దారులగు రైతుల గతి అధోగతిగా మారుతున్నది. ఇందువల్ల ప్రోత్సహించ వలసిన దానికి బదులు నిరుత్సాహ పరచడంగా ఏర్పడు తున్నది. యిదేనా గ్రోమోర్ ఫుడ్ విధానం? రైతుల్లారా! ఆందోళన చెయ్యండయ్యా.

* * *

నెల్లూరు అయితా రామయ్య శెట్టి గారు య 30 లు మాగాణి, య 100 లు మెట్టను దాన ధర్మాలకు వ్రాసిరట. అందులో 10 యకరాలు మాత్రం సంస్కృత కళాశాలకు, తక్కింది దేవాలయాలకు వ్రాశారట.

దాన ధర్మాలలో గూడా నేటి కాలాన్ని బట్టి యేది అవసరమా అనే విషయం దాతలు అన్వేషించడం గూడ అవసరం. దేవాలయాలకు యిది వరకిచ్చిన ఆస్తిపాస్తులే దుర్వినియోగ మౌతున్నవి. మళ్ళీ దేవాలయాలకు పెట్టడం యీశ్వరుడు గూడా సుతరాం వప్పుకోని విషయం. ఏది ఎట్లున్నా సంతాన భ్రమతో మళ్లీ పెళ్ళి చేసుకోకుండా దాన ధర్మాలకు

**50 ఏళ్లక్రితం ఈవారం**

వ్రాసినందుకు శెట్టి గారికి మా ధన్యవాదాలు.

### అవీ - ఇవీ

సిమెంటు ధర బస్తా 1 కి రు. 6 చెప్పాడని సంతపేట శెట్టి మీద కేసు పెట్టారు.

* * *

శంకరా స్టోర్సువారు నిషేధంలో వున్న వేరుశనగ నూనెను కొబ్బెర నూనె అనేమిషతో 3 డాగెనులు పెషావర్‌కు యెగుమతి చేశాడని బంగారయ్య రిపోర్టు చేశాడు.

* * *

ఆత్మకూరు తాలూకా దేవరాయపల్లి కరణం గారు 29 తేదీ బొగ్గేట్లో దిగి వెల్లువ వలన మునిగి చనిపోయినాడని. శవము

కొరవ 10 పేజీలో

# పివికి ఓటేయడం ప్రతితెలుగువాడిధర్మం!

కేంద్రంలో కాంగ్రెస్ అధికారంలో లేనప్పుడు ఎన్ని సంక్షోభాలు ఎదుర్కొన్నామో అందరికీ తెలుసు. దేశానికి విదేశీ మారక ద్రవ్యంలేదు. బంగారం తాకట్టు పెట్టి అప్పులు తెచ్చుకోవాల్సి వచ్చింది. అటువంటి సమయంలో పివి నరసింహారావు అధికార పగ్గాలు చేపట్టారు. నిదానంగా తనధోరణిలో పరిస్థితులు చక్కదిద్దారు. ఇప్పుడు ప్రపంచ దేశాలన్నీ పోటీలుపడి మనదేశంతో వ్యాపారం చేయడానికి ముందుకు వస్తున్నాయి. గత ప్రభుత్వం తాకట్టు పెట్టిన బంగారాన్ని తిరిగి తెచ్చారు. ప్రభుత్వం వద్ద ఎంతో విదేశీ మారక ద్రవ్యం నేడు నిల్వవుంది. ప్రస్తుత పరిస్థితులలో దేశానికి పివిని మించిన నాయకుడులేడు. వచ్చే నెలలో జరిగే అసెంబ్లీ ఎన్నికల్లో గెలుపు, ఓటముల ప్రభావం తప్పకుండా పివి మీద పడి తీరుతుంది. అందువల్లే ఇటీవల రాష్ట్ర పర్యటనలో భాగంగా ఏర్పాటైన సభల్లో ప్రసంగిస్తూ ఆయన ప్రపంచ దృష్టి మన రాష్ట్ర ఎన్నికలమీదే వుందని చెప్పారు. దేశ సుస్థిరత కోసం, సమగ్రత కోసం కాంగ్రెస్‌ను గెలిపించాలి. మనమిక్కడ కాంగ్రెస్‌కు వేసే ప్రతి ఓటూ తొలిసారిగా ప్రధాని అయిన తెలుగువాడి పాలనకు మెచ్చి వేసే ఓటుగా భావించి వేయాలి.

నెల్లూరు -సి.కోమల్.

## జనవాణి

### మాగుంట వాస్తవాన్ని గ్రహించాలి

రాజకీయ తాంత్రికులు నేదురుమల్లి జనార్ధనరెడ్డిచేత విత్తబడిన కొత్త కెరటపు విత్తు అనతికాలంలోనే తొటకూర కాడలా ఏపుగా పెరిగింది. తన ఉదార స్వభావంతో, ప్లీనరీ ఏర్పాట్లతో దేశవ్యాప్తంగా గుర్తింపు పొందారు ఎమ్పి శ్రీమాగుంట సుబ్బరామిరెడ్డి. ఆయన ఇప్పుడు అనవసర రాజకీయ రగడలోతల దూర్చి జిల్లాలో నాయకునిగా ఎదగాలన్న పోరాటంలో పార్టీని బజారులో పెట్టడం బాగోలేదు. తనకు వెన్నుదన్నుగా వున్న కావలి కలికితురాయి యానాదిరెడ్డిని కాదని అక్కడ కొత్తవారిని ప్రతిపాదించడం ఎంత మాత్రం ఆయనకు తగదు. మాగుంట మంచి మనిషి; కానిఎందరో

కొరవ 10 పేజీలో

# అలనాటి అర్జునుడే ఇలకు వచ్చినట్లుండింది!

సాహిత్య సభలు నిర్వహిస్తూ సాహిత్యాభి మానులకు విమల విందు గావిస్తూ, కవి పండిత సన్మానాలు జరుపుతున్న వర్ధమాన సమాజం ఆ అనవాయితీ తప్పి అబాల గోపాలం చూచి ఆనందించే విలు విద్యా ప్రదర్శన కార్యక్రమం ఏర్పాటు చేసింది. చక్కటి కార్యక్రమాలకు ప్రజలు తండోప తండాలుగా తరలి వస్తారన్న వాస్తవాన్ని ఈ విలు విద్యా

## నెల్లూరులో వెంకటేశ్వర్లు విలు విద్యా ప్రదర్శన

ప్రదర్శన చాటి చెప్పింది. చతుష్షష్టి కళలలో ఒకటైన విలు విద్యను అలనాడు అర్జునుడు అద్భుతంగా అభ్యసించి ప్రదర్శించారని పురాణాలలో చదివే మనకు ఆ అబ్బురాన్ని చూసే అవకాశం అభినవ కిరీటి బిరుదు కల్గిన మిన్నికంటి వెంకటేశ్వర్లు ద్వారా కల్గింది. విద్య ముందు వయసు బలాదూర్ అని చాటారా వృద్ధ ధనుర్విద్యా దురంధరుడు.

విలువిద్య ప్రారంభానికి ముందు జరిగిన సభలో సాహితీ వేత్త బెజవాడ గోపాలరెడ్డి మాట్లాడారు. మానవ జాతి వికాసానికి, కళ్యాణానికి శాస్త్ర; విద్యలు వుపయోగ పడాలి. జాతి వినాశనం క్షణ కాలంలో చేయగల మారణా యుధాలు కనుగొన్నారు; వాడుతున్నారు. మానవ జాతికి వీటి వల్ల ఏ పాటి మేలు జరుగుతుందని ఆలోచించాలని కోరారాయన. సర్కస్‌లో మాత్రమే చూడగల్గిన విలువిద్యను సభాముఖంగా ప్రదర్శించే ఏర్పాటు చేసిన వర్ధమాన సమాజాన్ని అభినందించారు. సభాధ్యక్షునిగా వ్యవహరించిన రొటేరియన్ జె.వి. రెడ్డి మాట్లాడుతూ ఆది మానవుడు ఆహారాన్వేషణ, ఆత్మ రక్షణల కోసం చేపట్టిన విల్లంబులు కొన్ని వందల సంవత్సరాల పాటు మానవ జాతి మనుగడను శాసించాయి. గత కాలంలో గొప్ప కీర్తి ప్రతిష్టలార్జించిన దేశాలు విలు విద్యలో వెనుకబడి పోగా, చిన్న చిన్న దేశాల వారు ఒలింపిక్స్ వంటి ప్రపంచ క్రీడలలో అగ్రశ్రేణిగా నిలుస్తున్నాయని ఆవేదన చెందారు.

బాణ ప్రయోగ చాతుర్య ప్రదర్శనలో మిన్నికంటి వెంకటేశ్వర్లు తొలుత శబ్ద భేది ప్రయోగాన్ని చేశారు. బాణాన్ని మరొక బాణంతో కొడుతూ

కొరవ 8 పేజీలో



అభినవ కిరీటిగా కీర్తి పొందిన మిన్నికంటి వెంకటేశ్వర్లు 1 తేది టౌన్‌హాల్‌లో తన విలు విద్యా ప్రదర్శనలో కాలితో బాణాన్ని సంధించి వదులుతున్న దృశ్యం

## చదువుల్లో సరస్వతి ముద్దుల కొడుకు; అధ్యాపకుడుగా అంతర్జాతీయ ఖ్యాతినందిన వాడు; వ్యక్తిగా ఆదర్శప్రాయుడు

# ఆచార్య రాళ్లపల్లి రామమూర్తి

1954లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆవిర్భవించినప్పట్నుంచి, 1994 వరకు, అక్కడ ఉపాధ్యక్ష పదవిని అలంకరించే అదృష్టం నెల్లూరు జిల్లాకు చెందిన ఏ ఆచార్యునికీ లేక పోయింది! ఈ ప్రజాస్వామ్యయుగంలో, వ్యక్తుల జ్ఞానసంపద, సృజనాత్మకత, శీలయోగ్యత, ప్రతిభావిశేషాలు ఎంత మహోన్నతమైనవయినప్పటికీ, వాటితోపాటు పరిగణనలోనికి తీసుకోవలసిన ఇతర అంశాలు ఇంకా ఎన్నో వుంటాయి కనుక, పరిస్థితులు అన్నివిధాలా అనుకూలించినప్పుడే, ఏ ఉన్నత పదవులైనా అటువంటి వారికి లభిస్తాయి. చివరికి విజ్ఞాన నిలయాలుగా సమాజంలో వెలుగొందవలసిన యూనివర్సిటీలకు వైస్ - ఛాన్సలర్‌లను ఎంపిక చేయడంలో సైతం రాజకీయ, రాజకీయేతర అంశాలుచేటు చేసుకోవడం ప్రజాస్వామ్య వ్యవస్థలో - మరీ ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న మన భారతదేశంవంటి దేశాలలో - అత్యంత సహజమైన విషయమనడం ఏమాత్రం అతిశయోక్తికాదు! అసంఖ్యాకమైన ఈ అవరోధాల్ని అధిగమించి, ప్రజ్ఞాపాటవంతో అగ్రశ్రేణిలోవున్న ఒక మేధావి ఒక ఉన్నత పదవిని సాధించ గలిగినప్పుడు, అంతకన్నా ఆనందించదగింది మరేముంటుంది? నిజంగా, ఎస్.వి.యూనివర్సిటీలో పుట్టిన 40 సంవత్సరాల తర్వాత, దాని ప్రాదేశిక పరిధిలోని నెల్లూరు

ఎన్నటికి చెరగని తన చిరునవ్వుతో, అనుక్షణం తాను ఆనందంగా వుంటూ, ఎదుటివారికీ, చుట్టూ వున్న వారికీ ఆనందాన్ని పంచిపెట్టే ఒక అసాధారణ వ్యక్తిత్వంగల మనిషి!

* * *

నెల్లూరు వాస్తవ్యులైన



ప్రొఫెసర్ రాళ్లపల్లి రామమూర్తిగారు 1936 జులై 27వ తేదిన ఒక విద్యావంతుల, ఉన్నతోద్యోగుల కుటుంబంలో జన్మించారు. వి. ఆర్. కాలేజిలో ఇంటర్ పూర్తయిన తర్వాత, ఆంధ్రా యూనివర్సిటీలో 1955లో బి.ఎస్.సి., పట్టభద్రులైనారు. తర్వాత శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీలో

## ప్రొఫెసర్ ఎన్. హెచ్. సీతారామశర్మ

జిల్లాకు ఈ నెల (అక్టోబరు) 10వ తేదిన జరిగిన సత్కారం అపూర్వమైనది, విశిష్టమైనది. ఆ శుభదినాన విక్రమ సింహపురి మేధావి ఒకరు 10 వ వైస్ -ఛాన్సలర్‌గా పదవి స్వీకారం చేయడం నిస్సందేహంగా చారిత్రాత్మకం! ఆయనే ఆచార్య రాళ్ళపల్లి రామమూర్తిగారు! అభిమానమే తప్ప దురభిమానాన్ని పొందనివారు, చూపనివారు, తమ రమ్యమైన మైత్రీ భావంతో, అసామాన్యమైన సౌమ్యతతో ఆకర్షణీయమైన సౌజన్యంతో, అయస్కాంతంవంటి కలుపుగోలు తనంతో, విశ్వాసాన్ని కలిగించే వినయ శీలత, వాఙ్మయమైన, నమ్రతతో, మౌలికమైన మంచి మనసుతో, సహజసిద్ధమైన సహృదయంతో, మమతకూ, మానవతకూ మారుపేరుగా నిలిచే ఈ జంతుశాస్త్ర ఆచార్యుడు,

ఎం.ఎ., ఎం.ఎస్.సి డిగ్రీలను ప్రథమ శ్రేణిలో తీసుకున్నారు. డిమాన్‌స్ట్రేటర్‌గా పనిచేస్తూనే, పరిశోధనచేసి, 1962లో జంతుశాస్త్ర విభాగంలో శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ డాక్టరేట్ ( పి.హెచ్.డి) డిగ్రీకి అర్హుడైన ప్రప్రథమునిగా ఘనత దక్కించుకున్నారు. 1965లో లెక్చరర్‌గా పదోన్నతి పొంది, పోస్ట్ డాక్టర్ ఫెలోషిప్‌తో, ఒక అమెరికన్ యూనివర్శిటీలో పనిచేయడానికి వెళ్లారు. దానిపేరు యూనివర్శిటీ ఆఫ్ ఒరెగాన్. అక్కడ వుండగా ఆయన చేసిన పరిశోధన అనేక ప్రముఖుల ప్రశంసల్ని చూరగొన్నది. అంతర్జాతీయ పరిగణనను పొందింది. భారతదేశానికి తిరిగివచ్చిన వెంటనే రామమూర్తిగారు, తన ఉత్తమ పరిశోధనకు ప్రతిఫలంగా, ఎస్.వి. యూనివర్శిటీ జంతుశాస్త్ర

కొరవ 8 పేజీలో

# ఎన్నికల్లో మద్యం అమ్మకాలు తగ్గించి, ఆదర్శంగా నిలవండి

ఎలక్షన్లలో మద్యం విక్రయాలు తగ్గించి ఎన్నికల నిర్వహణలో నెల్లూరు రాష్ట్రంలో ఆదర్శ జిల్లాగా గుర్తింపు పొందేలా సహకరించాలని మద్యం వ్యాపారస్తులను కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు కోరారు. శనివారం కస్తూరి దేవి ఆడిటోరియంలో మాట్లాడుతూ త్రాగిన వారు తమ ఓటు హక్కు మర్చిపోతారు; విచక్షణా జ్ఞానాన్ని కోల్పోతారు; మత్తు పదార్థం మా షాపులో వుంది; ఎన్నికల సమయంలో బయటకు రాకుండా ఎన్నికల సమయంలో చూడాల్సిన బాధ్యత వ్యాపారస్తుల పై వుందన్నారు. త్రాగి అరాచకాలకు దిగే అవకాశం వున్నందున అక్టోబర్ నెలలో విడుదల చేసిన కోటాలో సగం మాత్రమే నవంబర్ నెలలో కోటాగా విడుదల చేస్తున్నట్లు కలెక్టర్ చెప్పారు. ఎలక్షన్‌లో 7 రోజులు బ్రాంది షాపులు మూసి వేయాలి; ఎలక్షన్‌లో మద్యం విక్రయించే టప్పుడు అందుకు సంబంధించిన పూర్తి వివరాలు బిల్లులో నమోదు చేసి డూప్లికేట్ రసీదు ఇవ్వాలి. నవంబర్ 28 తేది స్టాకు పొజిషన్ తనిఖీ చేసి షాపుకు సీలు వేస్తారు. డిశంబర్ 3 తేది వుదయం వరకు అధికారులు షాపు సీలు తీసి స్టాకు తనిఖీ చేస్తారు. స్టాకులో తేడా వస్తే షాపు లైసెన్సు రద్దు చేస్తామని హెచ్చరించారు. కల్తీ కల్లు, మద్యం ఎక్కువ అమ్మకాలు జరిగితే ఎక్సైజ్ అధికారులు బాధ్యత వహించా లన్నారు. సమావేశంలో ఎస్.పి. రమణ మూర్తి, జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర, ఎక్సైజ్ అసిస్టెంట్ కమీషనర్ ఆర్. వెంకటేశ్వర రావు, ఎక్సైజ్ సూపరింటెండెంట్ దివాకర్ తదితరులు పాల్గొన్నారు.

## నెల్లూరు సంగతులు

### జిల్లాలో 18 వేల మరుగుదొడ్ల నిర్మాణం!

జిల్లాలో ఈ ఏడాది ఎంపిక చేసిన ప్రాంతాల్లో 18,085 మరుగు దొడ్లను నిర్మించ నున్నట్లు జిల్లా హౌసింగ్ కార్పొరేషన్ మేనేజర్ ఎం. జయరామరాజు చెప్పారు. 29 తేది మరుగు దొడ్ల నిర్మాణానికి సంబంధించి జిల్లారకు నిర్వహించిన శిక్షణా శిబిరం వద్ద విలేఖరులతో మాట్లాడారు. గ్రామాల్లో పారిశుధ్యం మెరుగు పరచడంలో ముఖ్యమైన అంశంగా వీటి నిర్మాణం చేపడుతున్నట్లు చెప్పారు. గ్రామీణ స్త్రీలు, యువతులు, వయోవృద్ధులు, వికలాంగులకు ఇవి వుపయోగ కరంగా వుంటాయన్నారు. జిల్లాలోని డెల్టా ప్రాంతంలో ఐదు లక్షల కుటుంబాలకు పైబడి మరుగు దొడ్లు లేవని తమ సర్వేలో తేలినట్లు చెప్పారాయన. ఒక్కొక్క మరుగు దొడ్డి నిర్మాణానికి 2500 తమ సంస్థ ద్వారా అందజేస్తామని; లబ్ధిదారులు 500 పెట్టుకొంటే, 500 యునిసెఫ్ వాటా, మరో 1500 డి.ఆర్.డి.ఏ. ద్వారా సమకూరుస్తా మన్నారు. ప్రస్తుతం హరిజన, గిరిజన, భూమిలేని వ్యవసాయ కూలీలకు వారి అవసరాలను బట్టి పూర్తి సబ్సిడీ ఇస్తామన్నారు. సమావేశంలో హౌసింగ్ కార్పొరేషన్ ఇ.ఇ. చంద్రశేఖర రెడ్డి మేనేజర్ ఎం. కొండయ్య కూడా పాల్గొన్నారు.

### కవికోకిల జయంతి సభ

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి 99 వ జయంతి సభ డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షతన 9 తేది టౌన్ హాల్‌లో జరుగుతుంది. ప్రఖ్యాత విజ్ఞాన శాస్త్రవేత్త డాక్టర్ అనుమకొండ జగదీశ్ సామాన్య మానవుడు - శాస్త్ర విజ్ఞానం, డాక్టర్ కరిమద్దెల నరసింహా రెడ్డి కవికోకిల కవితా రీతులు అనే అంశాల పై మాట్లాడి సన్మానాలు స్వీకరిస్తారు.

# టిక్కెట్ల సమరంలో చివరి గెలుపు జనార్దన రెడ్డిదే!

ఆయనక్కత సామంతు సుబ్బారెడ్డి పేరు ప్రతిపాదిస్తున్నారు. కాని సుబ్బారెడ్డికి పోటీ ఇష్టం లేదంటారు. పిల్చి పిల్లనిస్తానంటే వద్దనే అవివేకా సుబ్బారెడ్డి? ఏమో!

మాగుంట వర్గం పరిస్థితి చూస్తే నిముషానికొక మార్పు కన్పరుతున్నది. వారికి టిక్కెట్లు వస్తాయో రావో తెలియదు గాని, టిక్కెట్ల కోసం వారుతొక్కని గడపలేదు. ప్రాధేయపడని నాయకుడు లేడు.

ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి, డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి, కేంద్ర మంత్రి శ్రీ జీ. వెంకటస్వామి, సింగాపురం రాజేశ్వరరావు, జనార్దన పూజారి

## వెంకటగిరిలో పోటీకి అధిష్టానం ఆదేశం?

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురు మల్లి జనార్దనరెడ్డిని వెంకటగిరి నుంచే పోటీ చేయవలసిందిగా ఢిల్లీ నాయకులు ఆదేశించినట్లు విన్పడుతున్నది. జనార్దనరెడ్డికి ఈసారి అసెంబ్లీకి పోటీ చేసే ఆలోచన లేదు. చాలా వూగిసలాటలో వుండినాడు. ఒకసారి ముఖ్యమంత్రిత్వం నెరపిన తర్వాత తిరిగి ఎమ్మెల్యే కావడంలో రంజేమి వుంటుంది? అయితే దూరదృష్టితోనో లేక మరొక కారణం తోనో ఢిల్లీ అగ్రనాయకులు ఆయన్ను తిరిగి పోటీ చేయడానికి ఒప్పించినట్లు తెలుస్తున్నది. దీనివల్ల వెంకటగిరిలో అభ్యర్థిత్వపు వూహా గానాలకు తెరపడుతుంది. అక్కడ ఆయనే అభ్యర్థి; మరెవ్వరూ వుండరు.

తదితరులందరి సహాయాన్ని, సహకారాన్ని అభ్యర్థిస్తున్నారు మాగుంట సుబ్బరామరెడ్డి గారు. కాని తుది వరకు ఓపిక పట్టలేని అసహనభావం, తమ పేర్లకు చిన్న అభ్యంతరం చెప్పినా ఓర్చుకోలేని తత్వం వారిని ఈ నాయకులందరికీ దూరం చేస్తున్నది. సర్వేపల్లి సీటు విషయంలో తాను సివి శేషారెడ్డికి ప్రామిస్ చేసివున్నానని, అతనికి చెక్ చేయలేనని ముఖ్యమంత్రి చెప్పడంతో ఆయన్ను తొందరపడి తూలనాడారట. ఆ వార్త ఆయనకు చేరిపోయింది. లిస్టులు తయారుచేసి ఇవ్వడానికి

## తిరుగుబాట్లు

(మొదటి పేజీ తరువాయి)

నీకింకా అనుభవం రాలేదు అని డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి వ్యాఖ్యానించడంతో అలిగి ఆయన్నుంచి దూరంగా తప్పుకున్నారు. ఈ తొందరపాటు ప్రవర్తన చూసిన ఇతర నాయకులూ వీరి పట్ల ఇదివరకటి ఆత్మీయత చూపడం లేదు. ఒక్క పెళ్లకూరు రామచంద్రారెడ్డిగారు మాత్రం సుబ్బరామరెడ్డిని పివి ఇంటికి తీసుకవెళ్ళి, తీసుక వస్తున్నారు. రకరకాల సందర్భాలలో పివిని వారు ఐదారు సార్లు కలిశారట. పివి తమతో సానుకూలంగా మాట్లాడాడన్న ధైర్యంతో వున్నారు.

అయితే తమకంటూ మిగిలిన ఒక్క పెళ్లకూరు విషయంలో విశ్వాసపాత్రంగా వ్యవహరించ లేక పోయారని తెలుస్తుంది. సుబ్బరామరెడ్డిగారు తన అభ్యర్థుల జాబితాగా జనార్దన పూజారికి ఇచ్చిన కాగితంలో అల్లూరు పేరు, ప్రస్తావన లేదట. పెళ్లకూరు తన కుమారుడు ప్రభాకరరెడ్డికి ఈ సీటు ఇప్పించాలని పివి దగ్గర తన పలుకుబడినంతా వుపయోగించి పనిచేస్తున్న సంగతి తెలిసిందే! తాను ఒక్క టికెట్‌తో తృప్తిపడి, తతిమా అన్ని టిక్కెట్లనూ సుబ్బరామరెడ్డి గారికే ఇప్పించడానికి ప్రయత్నిస్తున్న తన పట్ల ఇట్లా ప్రవర్తించడం పెళ్లకూరుకు కష్టం కల్గించినట్లుంది. అయితే ఆ నింద చాలా తేలికగా మాదాసు గంగాధరం పైకి త్రోసి సుబ్బరామరెడ్డిగారు పెళ్లకూరుతో మళ్ళి రాజీ పడిపోయారు.

మొదట 11 సీట్లు కోరిన సుబ్బరామరెడ్డిగారు ఇప్పుడు నెల్లూరు ఒక్క దానితో సరిపెట్టుకోవడానికి మానసికంగా సిద్ధమైనారంటున్నారు. జెకె రెడ్డికి కావలి, జానకిరాంకు ఉదయగిరి కూడా ఇప్పించాలని ప్రయత్నిస్తున్నట్లు చెప్తున్నారాయన.

రాపూరులో ఆనం రామనారాయణ రెడ్డికి ఇవ్వడంలో తనకేమీ అభ్యంతరం లేదని ఆయన పివికి స్వయంగా చెప్పారట. టిక్కెట్లు ఎవరికి ఇచ్చినా తాను నికరమైన కాంగ్రెస్ వాదిగా, అందరి గెలుపుకూ తన సహకారం అందజేస్తానని కూడా పివి దగ్గర నమ్మబలికి వచ్చారు.

కాని ఆయన చెప్పినంత తేలికగా ఆయన అనుచరులు టిక్కెట్ల ఓటమిని సహించే పరిస్థితి కన్పించడం లేదు. అభ్యర్థిత్వాలకై చాలా ఆశపెట్టుకొని వున్నారు వారు.

విచిత్రంగా, శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి అందరికంటే ఎక్కువగా ఆవేశానికి లోనై వున్నారు. గూడూరులో తను చెప్పిన ఓడూరు రామచంద్రయ్యను కాదని, పాత పత్రా ప్రకాశరావునే అభ్యర్థిగా ప్రకటింపజేయడం జనార్దనరెడ్డి పట్ల ఆయనకు ఆగ్రహం రగిలించింది. మేగౌరె నిప్పును మరింత ఎగద్రోసినట్లున్నాడు. ఆ ఉడుకులో ఢిల్లీకి విమానమెక్కారు. అక్కడ మాగుంట, పెళ్లకూరులు కలిసి నీకు వెంకటగిరి టిక్కెట్ ఇప్పిస్తాం అని హామీ ఇచ్చారట. ఆయనకు నమ్మకం కల్పించడం కోసం, పిజెసి నుంచి రాకపోయి నప్పటికీ గూడూరు స్థానానికి శ్రీ ఓడూరు రామచంద్రయ్య పేరును స్టీరింగ్ కమిటీ జాబితాలో చేర్పించారు. డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి, జి. వెంకటస్వామి ఈ విషయంలో వారికి సహకరించినట్లున్నారు. అది చూసి ఆయన వారిపట్ల నమ్మకం పెంచుకున్నారు. నాలుగు రోజులు వారితో సహచర్యం, మేగౌరె బ్రెయిన్‌వాష్‌తో వెంకటగిరిలో తనకు టికెట్ రాకుంటే స్వతంత్రుడిగా నైనా పోటీ ఖాయం అని ప్రకటించాడు. కాని వేమారెడ్డి కోపం తాటాకు మంట వంటిదనే భావించాలి. తాత్కాలికంగా ఉద్రేకాలకు లోనైనా జనార్దనరెడ్డితో తనకున్న ఇరవయ్యేళ్ళ స్నేహితాన్ని, సాన్నిహిత్యాన్ని ఆయన విస్మరిస్తాడను కోలేము. 5 తేది నామినేషన్ వేసేది నిజం- పెళ్లకూరు నాకు కాంగ్రెస్ టిక్కెట్ తెచ్చిస్తానన్నారు, తేలేక పోతే స్వతంత్రుడిగా రంగంలో వుండి తీరుతాను అని చెప్పారాయన.

అదే సమయంలో గూడూరు నుంచి స్వతంత్రుడిగా ఓడూరు రామచంద్రయ్య చేత నామినేషన్ వేయించమని మాగుంట సుబ్బరామరెడ్డిగారు వత్తిడి తెస్తున్నట్లుంది. తెలుగుదేశంతో తెగ త్రెంపులకైనా రెడీ అన్నట్లున్న ఎన్‌సిని కలుపుకొని తాను పనిచేస్తే గూడూరులో స్వతంత్ర అభ్యర్థిని గెల్పించడం కష్టసాధ్యం కాదని వేమారెడ్డి అంచనా వేస్తున్నారు. ఈ రెండు స్థానాలలో ఎన్నికల వ్యయం గురించి భయపడవలసిన పనిలేదని మాగుంట సుబ్బరామరెడ్డిగారు భరోసా ఇస్తున్నట్లున్నారు.

రాపూరులో స్వతంత్ర అభ్యర్థిగా పోటీకి రావుల అంకయ్య గౌడ్ ముస్తాబౌతున్నారు. తన స్వంత ఓట్లు 20 వేల వరకు వున్నాయని; మాగుంట సహకారం, తెలుగుదేశంపై కక్షతో వున్న ఏపినాపి సోదరుల అండ లభిస్తే తాను సులభంగా గెలుస్తానన్నది అంకయ్య గౌడ్ ఆశ.

ఉదయగిరిలో తనకు అన్యాయం జరిగితే, స్వతంత్రుడిగా నిలబడి ప్రజల నుంచి న్యాయం కోరాలని మాదాల జానకిరాం పట్టుదలతో వున్నట్లు విన్పడుతున్నది. ఇటు రాజమోహన్‌రెడ్డి, అటు కంభం విజయరామిరెడ్డి అభ్యర్థులైతే, కమ్మ ఓట్లు అధికంగా ఉదయగిరి నియోజక వర్గంలో తన గెలుపు సునాయాస మన్నది ఆయన అంచనా. కాని పరిస్థితులు గమనిస్తే జానకిరాంకు అంత అవసరం రాకపోవచ్చునని, టికెట్ ఆయననే వరించ వచ్చునని అన్పిస్తున్నది.

ఎక్కడా టికెట్ రాని పక్షంలో సర్వేపల్లిలో స్వతంత్రుడిగా అదృష్టం పరీక్షించుకోమని జెకెను ఆయన అనుచరులు ఒత్తిడి చేయబోయేట్లున్నారు. కాని జెకె ఈసారి అటువంటి పొరపాటు నిర్ణయం తీసుకోడన్నది మా దృఢాభిప్రాయం. నెల్లూరులో పివి ప్రసన్న రెడ్డిమీద కూడా ఇటువంటి వత్తిడి విపరీతంగా వచ్చే అవకాశంవుంది. అయితే ప్రసన్న పదవుల కోసం వెంపర్లాడే తత్వం కల్గిన వాడు కాదు; పార్టీకి ద్రోహం చేసి ప్రజలలో వెల్లిపడే నిర్ణయం తీసుకోడు.

కాంగ్రెస్ . టిక్కెట్లకు సంబంధించి ప్రస్తుత పరిస్థితి ఇది! ఎప్పటివలెనే ఈసారి సైతం టిక్కెట్ల పోరులో తుది గెలుపు జనార్దనరెడ్డిదే అవుతుందనడంలో సందేహం లేదు. పెళ్లకూరు మాగుంటలకు చెరొక సీటు ఇవ్వడం మినహా, పివి నరసింహారావుగారు జిల్లాలో జనార్దనరెడ్డికి వ్యతిరేకంగా టిక్కెట్లు పంపిణీ చేస్తాడని భావించలేము. చెరొక సీటన్నది సైతం చివరి వరకు సందేహమే.

తరువాయి 7 పేజీలో

## తాజావార్త

తాజాగా అందుతున్న సమాచారాన్ని బట్టి, నెల్లూరు జిల్లాలో 7 స్థానాలకు అభ్యర్థులను పివి క్లియర్ చేసినట్లు తెలుస్తున్నది !

ఆ పేర్లివి

### ఖాయమైన కాంగ్రెస్ సీట్లు

| | |
|---|---|
| **సర్వేపల్లి** | **గూడూరు** |
| సి.వి.శేషారెడ్డి | పత్రా ప్రకాశరావు |
| **రాపూరు** | **సూళ్లూరు పేట** |
| ఆనం రామనారాయణరెడ్డి | పసల పెంచలయ్య |
| **కావలి** | **ఆత్మకూరు** |
| కలికి యానాదిరెడ్డి | డాక్టర్. బి. సుందరరామరెడ్డి |
| **వెంకటగిరి** | |
| నేదురుమల్లి జనార్దనరెడ్డి | |

### పరిశీలనలో వున్న పేర్లు

| | |
|---|---|
| **నెల్లూరు** | **కోవూరు** |
| చేవూరు దేవకుమార్‌రెడ్డి | పి.వి. ప్రసన్నరెడ్డి |
| ఒక లేడీ డాక్టరు | చేవూరు దేవకుమార్ రెడ్డి |
| **ఉదయగిరి** | **అల్లూరు** |
| మాదాల జానకిరాం | పెళ్లకూరు ప్రభాకరరెడ్డి |
| మేకపాటి రాజమోహన్‌రెడ్డి | గ్రిద్దలూరు సుందరరామయ్య |

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## 7 తేది నామినేషన్లు

నామినేషన్లకు 5, 7 తేదులు మంచి రోజులని సిద్ధాంతులు నిర్ణయించారు. కాంగ్రెస్ అభ్యర్థు లందరూ 7 తేది ఉదయం 11.20 నిముషాల శుభ ఘడియల్లో నామినేషన్ పత్రాలు దాఖలు చేయబోతున్నారు. అప్పటికి టిక్కెట్ల ప్రకటన కూడా పూర్తవుతుంది.

5 తేది తెలుగుదేశం అభ్యర్థులు శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి, శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడు నామినేషన్లు వేస్తారు. ప్రసన్న, వర్ప్రరత్నం వగైరాలు 7 తేదిని శుభ ముహూర్తంగా ఎంచుకొన్నారు.

## ఏడు నామినేషన్లు

జిల్లాలో సమాచార మంది నంత వరకు, అప్పటికి ఏడుగురు నామినేషన్లు దాఖలు చేసి వున్నారు. వారు వీరూ-

కోవూరు - ఇంతా వెంగళ రెడ్డి, ఇసాక్ మిల్టన్, జి. హరిప్రసాద్ రెడ్డి; సర్వేపల్లి - తిక్కవరపు రామానుజులు రెడ్డి; రాపూరు - సుబ్బరామ రాజు; ఆత్మకూరు - మాలకొండయ్య; వెంకటగిరి - వల్లూరు వెంకయ్య!

## నెల్లూరు సబ్‌జడ్జి కోర్టులో

EP No. 53 of 91 : : OS No. 148 of 77

యూనియన్‌బ్యాంకు అఫ్ ఇండియా, నెల్లూరు -డిక్రీ హోల్డరు, వాది.

Vs

1. చెరుకుపల్లి కృష్ణయ్య నాయుడు, మరియు ఇతరులు

-జడ్జిమెంటు డెటార్సు, ప్రతివాదులు.

ఈ క్రింద ఉదహరించిన షెడ్యూలు దాఖలా స్థిరాస్తులను పై కోర్టులో 14-11-94 తేదిన ఉదయం 10.30 గంటల నుండి సాయంత్రం 5గంటల లోపల బహిరంగముగా వేలము వేయబడును. పాడదలచిన వారు పాల్గొనవచ్చును.

### షెడ్యూలు

ఐటమ్ నంబరు : II నెల్లూరు డిస్ట్రిక్టు రిజిస్ట్రేషను, ముత్తుకూరు సబ్ రిజిస్ట్రీ నెల్లూరు జిల్లా, నెల్లూరు తాలూకా, పంజావారుపాడు గ్రామం - మూడవ జడ్జిమెంట్ డెటార్ రావి బాలకృష్ణ నాయుడుగారి మాగాణి భూమి.

(A) పట్టా నం. 1176, సర్వేనం. 109 నందలి య.3.96 సెంట్లలో య. 3.00 సెంట్లు మాగాణి భూమికి హద్దులు:- తూర్పు: పారుదల కాలవ, కొంత, పెగ్రాజా నారయ్య భూమి కొంత వరకు; దక్షిణం : బీడు; పడమర : జిల్లాబోర్డు రోడ్డు; ఉత్తరం : హరిజన వాడకొంత, అరని రంగారెడ్డి మాగాణి భూమి కొంత; వాది విలువ : రూ. 30,000/-; అమినా విలువ : రూ.60,000/-;

(B) సర్వే నం. 166నందు య.3.04 సెంట్లల్ ఉత్తర పక్క భాగం నందు య.0.50 సెంట్లకు హద్దులు:- తూర్పు: నాయొక్క భూమి; దక్షిణం : బీడు; పడమర : రోడ్డు; ఉత్తరం : పై సర్వేనంబరు భూమి (పోలరెడ్డి భూమి)

వాది విలువ: రూ.5,000/-

అమినా విలువ:రూ.10,000/-;

(C) సర్వే నం. 95/1 నందలి 0.54 సెంట్లలో య. 0.50 సెంట్లుకి హద్దులు: తూర్పు: రాపూరు సుబ్బరామ నాయుడు తోట; దక్షిణం : డొంక; పడమర : రోడ్డు; ఉత్తరం : పారుదల కాలువ;

వాది విలువ : రూ. 5,000/-

అమినా విలువ: రూ.10,000/-;

ఐటమ్ నం. II : నెల్లూరు డిస్ట్రిక్ట్ రిజిస్ట్రేషను - ముత్తుకూరు సబ్ రిజిస్ట్రీ, నెల్లూరు జిల్లా, నెల్లూరు తాలూకా, ఈపూరు బిట్ II, గూడ్లూరు వారిపాళెం పంచాయితి పరిధి - పుంజాలూరు పాడు గ్రామం - 5 వ జడ్జిమెంట్ డెటార్ గొట్టమనేని ఓబులు నాయుడు గారి భూమి-

(A) పట్టా నం. 1176, సర్వే నం. 109 నందు య.3.96 సెంట్లు, సర్వే నం.110 నందు య.4.12 సెంట్లు నందలి మధ్యభాగమున య.2.00 సెంట్లు మాగాణి భూమికి హద్దులు:- తూర్పు: సర్వేపల్లి నారాయణభూమి; దక్షిణం: పెమ్మసాని ఆదెమ్మ భూమి కొంత, కాలువ కొంత వరకు; పడమర: పారుదల కాలువ; ఉత్తరం: అరని నరసారెడ్డి భూమికొంత, పారుదల కాలువ కొంత;

వాది విలువ :రూ. 20,000/-;

అమినా విలువ : రూ. 40,000/-;

ఐటమ్ నం.III : షెడ్యూలు దాఖలా 5వ జడ్జిమెంట్ డెటార్ గొట్టమనేని ఓబుల్ నాయుడు భూమి-

(A) పట్టా నం. 1176, సర్వే నం.27 నందు య.3.24 సెంట్లు, సర్వే నం.28 నందు య.4.37 సెంట్లు నందలి దక్షిణ భాగమున య.1.02 సెంట్లు మాగాణి భూమికి హద్దులు:- తూర్పు: డైనేజి కాలువ ; దక్షిణం: సర్వేపల్లి నరసయ్య మరి ఇతరుల భూమి; పడమర : పారుదల కాలువ; ఉత్తరం: కోగి చినవెంకమనాయుడు భూమి;

వాది విలువ: రూ.10,000/-;

అమినా విలువ :రూ.20,000/-లు .

పారుదల వసతి మరియు ఈజ్‌మెంట్ హక్కుల తోటి. ఇ.సి. ప్రకారము పై ఆస్తులుపైన ఎటువంటి పరాధీనములు కాని అడు మానములు కాని లేవు.

వేలము తేది: 14-11-94

తదుపరి విచారణ తేది: 21-11-94

డి. హనుమంతరావు,

డిక్రీహోల్డరు అడ్వోకేటు, నెల్లూరు.

# ఎన్‌సి ఉక్రోషం పట్టలేకున్నాడు!

జిల్లాలో తెలుగుదేశం టిక్కెట్ల విషయంలోనూ బిభాభిప్రాయాలు తొలగలేదు; మనస్పర్థలు సర్దుకోలేదు. ఈ న్యూసెన్స్ భరించలేకనే ఎన్‌టి రామారావు గారు ఇంకా మూడు సీట్ల ప్రకటన నిలిపి వేసి వున్నారు. ప్రకటించ లేదనే గాని అభ్యర్థుల నిర్ణయం ఎప్పుడో జరిగి పోయి నట్లె లెక్క. నెల్లూరుకు శ్రీ టి. రమేష్ రెడ్డి, కావలికి శ్రీ ఒంటేరు వేణుగోపాల రెడ్డి, ఉదయగిరికి శ్రీ కంభం విజయరామి రెడ్డిలలో మార్పు సాధారణంగా వుండదు. ఉదయగిరిలో మహిళా అభ్యర్థినిగా శ్రీమతి కొండా చెంచులక్ష్మి చివరి కంటా పోరాడు తున్నారు.

కావలిలో శ్రీ గొట్టిపాటి కొండప నాయుడు ఒక చిన్న లేఖా వివాదం సృష్టించారు. అందరూ రెడ్లయితే ప్రజలలో నిరసన వస్తుంది కాబట్టి, కావలిలో కమ్మ నాయకుడిగా కొండప నాయుడు గారికి టిక్కెటిస్తె తన కభ్యంతరం లేదని ఎన్‌టిఆర్ కూ నుంచి ఒక జాబు తెమ్మన్నాడని అబద్ధం చెప్పి, వేణుగోపాల రెడ్డి నుంచి లేఖ తీసుకున్నారట. దాన్ని వేరొకరి చేత ఎన్‌టిఆర్‌కు చేర్పించి, తనకు టిక్కెట్ అడిగారు నాయుడు గారు. కాని ఎన్‌టిఆర్ దాన్ని చూస్తూనే మండిపడి నాకు జాబులు వ్రాసేంత పెద్ద వాడై పోయారా అని తిట్టాడట. వేణుగోపాల రెడ్డి ఇది తెలుసుకొని, కుయ్యో మొర్రో అని ఎన్‌టిఆర్‌కు జరిగిన సంఘటన వివరించి, శాంతింప జేశారు.

> తెలుగుదేశంలోనూ తిరుగుబాట్ల బెడద తప్పదా? నల్లపరెడ్డి రాజేంద్ర నా సత్తా చూపుతా నంటున్నాడు; డేగా మౌనంగా కుములు తున్నాడు!

వెంకటగిరిలో తనకు కాకుండా రాజాకు, గూడూరులో తనవాడికి కాకుండా బల్లి దుర్గా ప్రసాద్‌కు టికెట్ ఇవ్వడం ఎన్‌సిని నిప్పు తొక్కిన చందంగా మార్చింది. ఆయన ఉక్రోషం పట్ట లేకున్నారు. దానికి తగినట్లె కోట, వెంకటగిరి ప్రాంతాల నుంచి నల్లపరెడ్డి వర్గమంతా ఎన్‌సి వద్దకు వచ్చి తమ ఆవేదనను, మద్దతును ప్రకటిస్తున్నారు. తిరువాళ్లగా వుండి ఎన్‌సి ఇల్లు, శీనయ్య మరణం తర్వాత పెద్ద దిక్కుగా భావిస్తున్న ఎన్‌సికి అవమానం జరగడం వారికి బాధ కల్గిస్తూంది. నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డిని వారు తమ వర్గ నాయకుడిగా స్వీకరించ లేకున్నారు. ఈ రెండు నియోజక వర్గాలలో ఎన్‌సి ఏ నిర్ణయం తీసుకుంటాడనే దాని పై తెలుగుదేశం జయాప జయాలు ఆధారపడి వుంటాయి.

ఇంకొక ప్రక్క శీనయ్య రెండవ కుమారుడు రాజేంద్ర కుమార రెడ్డి వెంకటగిరిలో స్వతంత్ర అభ్యర్థిగా పోటీకి సిద్ధమౌతున్నాడు. సోదరుడు ప్రసన్న ఎంత చెప్పినా విన్పించు కోవడం లేదట.

మౌనమే నీ భాష ఓ మూగ మనసా అని విషాద గీత మాలపిస్తున్నారు డేగా నారసింహా రెడ్డి గారు. ఆయనలో తిరుగుబాటు ఆలోచన లేదు. చేసినా కాంగ్రెస్ ఇల్లు నిండి పోయి వుంది. దూరడానికి సందు లేదు. సర్దుకొని వుండడానికి ఓపికలేదు. రాజ్యసభ సీటు ఆశ చూపిస్తు న్నట్లున్నారు ఎన్‌టిఆర్ గారు - డేగాను విలువరించ డానికి!

## మళ్లీ తుఫాన్

31 తేది రాత్రి నెల్లూరు చేరువకు వచ్చి, మద్రాసు మీద తన ప్రతాపం చూపించిన పెను తుఫాన్ నీడలు ఇంకా జిల్లాను వదలక ముందే మరొక తుఫాన్ ప్రమాదం ముంచుకొని వస్తున్నది. నాగపట్నానికి 800 కిలోమీటర్ల దూరంలో, శ్రీలంకకు సమీపంగా - బంగాళా ఖాతంలో లేచిన వాయుగుండం పయన దిశ దక్షిణ భారత కోస్తా తీరం వైపే వుందని వార్తలు. ఇప్పటికి భయం లేదు. రేపు, ఎల్లుండికి గాని దాని సంగతి తెలదు.

31 తేది తుఫాన్ తర్వాత రుతు పవనాలు వూపందు కున్నాయి. ముసురు పట్టి, ముంచు కొస్తున్నది వాన. మూడు రోజుల నుంచి సూర్య దర్శనం లేదు. చాలా ప్రమాద కరమైనది ఈ వాన. ఆగకుండా క్రమం తప్పకుండా కురవడం వల్ల చెరువు కట్టలు, మట్టి ఇళ్ల గోడలు నాని పోతాయి. దురదృష్టవ శాత్తు తుఫాన్ తగులుకుంటె గండ్లు పడడం, నేల కూలడం జరుగుతాయి.

30 తేది నుంచి 3 తేది వరకు జిల్లాలో కురిసిన వర్షపాతం వివరాలివి-

| | |
|---|---|
| వరికుంటపాడు | 450.0 మి.మీ. |
| గూడూరు | 386.4 మి.మీ. |
| వింజమూరు | 332.6 మి.మీ |
| సైదాపురం | 330.8 మి.మీ. |
| పొదలకూరు | 311.4 మి.మీ. |
| వాకాడు | 310.1 మి.మీ. |
| కోట | 287.0 మి.మీ. |
| కొండాపురం | 285.0 మి.మీ. |
| నాయుడుపేట | 267.8 మి.మీ. |
| చిట్టమూరు | 262.8 మి.మీ. |
| సీతారాంపురం | 260.0 మి.మీ. |
| మర్రిపాడు | 257.8 మి.మీ. |
| కలిగిరి | 251.0 మి.మీ. |
| ఉదయగిరి | 250.0 మి.మీ. |
| వెంకటగిరి | 247.8 మి.మీ. |
| సూళ్లూరుపేట | 242.6 మి.మీ. |
| చేజర్ల | 240.2 మి.మీ. |
| వెంకటాచలం | 239.7 మి.మీ. |
| ఆత్మకూరు | 237.2 మి.మీ. |
| ఓజిలి | 232.6 మి.మీ. |
| పెళ్లకూరు | 223.1 మి.మీ. |
| కావలి | 214.8 మి.మీ. |
| తడ | 206.0 మి.మీ. |
| బాలాయపల్లి | 198.8 మి.మీ. |
| డక్కిలి | 196.0 మి.మీ. |

## టి.బి. ఆస్పత్రిలో పండ్లు పంపకం

రాష్ట్ర అవతరణ దినోత్సవం సందర్భంగా పోలీస్ కాలనీ యూత్ అసోసియేషన్ సభ్యులు నెల్లూరు టిబి ఆస్పత్రిలో రోగులకు పండ్లు పంచి పెట్టారు. మాగుంట సంస్థల ముఖ్యాధికారి శ్రీ పి.వి. ప్రసన్న రెడ్డి ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా

కొరవ 7 పేజీలో

## సంస్మరణ

1974 సంవత్సరం నవంబరు 11వ తేది మమ్ములనందరినీ దుఃఖసాగరమున ముంచి దివంగతులైన **టి. వి. రమణారెడ్డి** గారికి

శ్రద్ధాంజలి ఘటిస్తూ-



-కుటుంబ సభ్యులు

## జలవిలయం

2 పేజీ తరువాయి

గన్నై, ప్రాణాలు విడిచారు. బస్ నుంచి బయట పడిన వారి సంఖ్య 32. ఈలోగా ఈ సమాచారం గూడూరుకు తెలిసి పోలీసు, ఫైర్ సర్వీసు సిబ్బంది వచ్చి, బస్ టాప్ పైన వున్న వారిని రక్షించారు. పైపాడు నుంచి ఈతగాళ్లను రప్పించి, 1 తేది మధ్యాహ్నానికి లోపలున్న శవాలన్నింటినీ వెలికి తీయించారు. ఒక్కొక్క శవాన్ని నీళ్ళలో నుంచి లాగి, రోడ్డు పైన వరుసగా పంత పెట్టడం చూస్తుంటే కడుపులో త్రేవి నట్లుండింది. ఆ శవాలన్నింటినీ ఒక లారీ కెక్కించి గోదావరి జిల్లాకు పంపివేశారు.

చనిపోయిన వారిలో 15 మంది మగవారు, 13 మంది స్త్రీలు, 11 మంది పిల్లలు. అందరూ తిరుపతి వెంకన్నకు మొక్కు చెల్లించు కోవడానికి బయల్దేరిన వాళ్లే. వారు తన వద్దకు వచ్చే వరకు ఆగలేక మధ్యలోనే వారిని తనలో ఐక్యం చేసుకున్నారు స్వామి.

అర్ధరాత్రి సమయం; కటిక చీకటి; ఉలిక్కి పడి నిద్రలో నుంచి లేచేసరికి గొంతు లోతు నీళ్లు; ఎటు పోవాలో, ఏమి చేయాలో తెలియని అయోమయం; ప్రాణ భయంతో కేకలు పెట్టడానికి కూడా గొంతు పెగలని భయోద్విగ్నత; నీళ్లలో మునిగి పోతున్నామని తెలిసినా తప్పించు కోలేని నిస్సహాయత; క్షణ క్షణానికి నీళ్ల లోతు పెరిగి, సీట్ల మధ్య చిక్కుకు పోయి ఎటూ కదలలేక, చావు ముంచు కొస్తున్నదనీ తెలిసీ ఏమీ చేయలేక చనిపోవలసి రావడం ఎంతటి హృదయ విదారక పరిస్థితి? ఆ బస్సు ప్రయాణీకులు ఏ జన్మలో ఏ పాపం చేశారో కాని, ఈ జన్మలో బ్రతికుండగానే నరకం చవిచూసి, సజీవంగా జలసమాధి చెందారు.

అసలు వారికి చావు వ్రాసి పెట్టి వుండే ఆ బస్సు వాగులోకి దిగిందను కోవాలి. తన ముందు లారీ వెళ్లకుండా వుండి వుంటే బస్ డ్రైవరు నీళ్లలోకి దిగేవాడు కాదు. వెనక్కు తిప్పుకొని బైపాస్ రోడ్డు మీదుగా సురక్షితంగా వెళ్లిపోయి వుండేవాడు. ఆ డ్రైవరు - బొల్లా ప్రసాద్ (32) విలపిస్తూ అదే చెప్తున్నాడు. పాపం అతడి భార్య కూడా ఈ ప్రమాదంలో అసువులు బాసింది. నేనూ ఆ నీళ్లలో పడి మునిగి పోయి వుంటే ఎంత బాగుండేదని విలపిస్తు న్నాడతను. తన చేజేతులా 39 మందిని చంపానని వాపోతున్నాడు.

ఈ ప్రమాదానికి డ్రైవరు తొందరపాటు ఎంత కారణమో, అర్ అండ్ బి అధికారుల నిర్లక్ష్యం కూడా అంతే కారణం. వానలు వచ్చినప్పుడల్లా పంబలేరు పొంగి పారుతుందన్న సంగతి ప్రతి అధికారికి తెలుసు; గూడూరు టౌన్‌లోకి వెళ్లే వాహనాలన్నీ ఆ కాజ్‌వేను దాటు తుంటాయనీ తెలుసు. తెలిసీ వారు కనీసం కాజ్‌వేకు రెండు అంచులా ప్రమాద సూచికలు లేదా పిట్టగోడ నిర్మించ లేదంటే ఏమను కోవాలి! వారా చిన్న జాగ్రత్త తీసుకొని వుంటే ఇప్పుడిన్ని ప్రాణాలు హరీ మనేవా? చనిపోయిన వారి ఉసురు తగిలైనా మన అధికారులలో చలనం వస్తుందేమో చూడాలి.

మరొక ఆందోళన కల్గించే విషయం - ఈ బస్సులో 72 మంది ప్రయాణీకు లుండడం. ట్రాన్‌పోర్టు అధికారులు అంతంత మందిని రాత్రి పూట హైవే పై తిరిగే బస్సుల్లో ఎట్లా అనుమతిస్తున్నారో అనూహ్యం. పైపెచ్చు ఈ బస్సు కిటికీ అద్దాలు బిగుసుకు పోయి వూడి రాలేదట. అవి వదులుగా వుండి వుంటే మరి కొందరైనా బ్రతికి వుండేవారు. బస్సులకు టూరిస్ట్ పర్మిట్లు ఇచ్చే ముందు కనీస పాటి జాగ్రత్తలు పాటించక పోవడం రవాణా శాఖాధి కారుల వైఫల్యం క్రిందకే వస్తుంది.

* * *

అదే రోజు రాత్రి, కావలికి ఉత్తరంగా చిల్లా కాలువ ఉప్పొంగి జాతీయ రహదారి పై పారుతున్నా, ధైర్యం చేసి నీళ్లలోకి దిగిన ఒక లారీ నాలుగు పల్టీలు కొట్టింది. రాళ్లపాడు చెరువు గండ్లు పడడం వల్ల వచ్చిన వరద ఇది. ఆ లారీ డ్రైవరు నీటి ప్రవాహానికి కొట్టుక పోయాడు.

ఈ చావుతో కలిపి, నెల్లూరు జిల్లాలో జలవిలయం చావుల సంఖ్య 40కి పెరిగింది.

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

హాజరైనారు. డాక్టర్ పెంచలు రెడ్డి, టి. ఇందూధర్ రెడ్డి, సి.హెచ్. మురళి, వెంకట నారాయణ రెడ్డి తదితరులు పండ్ల పందారం నిర్వహించారు.

### జనార్ధన రెడ్డి

టిక్కెట్ల తపస్సులో రెండు వారాలుగా ఢిల్లీలో వుండిన రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 6 తేది సాయంత్రం నెల్లూరు వస్తారు; 7 తేది వెంకటగిరిలో నామినేషన్ దాఖలు చేస్తాడు.

### బిజెపిలో గంగినేని

తెలుగుదేశం జిల్లా కమిటీ మాజీ కన్వీనరు శ్రీ గంగినేని రమణయ్య నాయుడు బి.జె.పి.లో చేరారు. కాషాయం మీద మోజెందుకు కల్గిందో ఆయనకు!

### కలెక్టర్ కఠిన నిర్ణయాలు

ఎన్నికల సమయంలో ఏ అభ్యర్థి నియమావళిని అతిక్రమించినా తన, మన లేకుండా కఠిన చర్యలు తీసుకోమని క్రింది అధికారులకు హుకుం జారీ చేశారు కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు గారు. శేషన్‌ను తలపింప జేస్తున్నా డాయన - నిబంధనల విషయంలో! పత్రికలలో అడ్వర్‌టైజ్‌మెంట్లు, కర పత్రాలు, గోడల మీద వ్రాతలు, జెండాలు, బ్యానర్లు, కటౌట్లు, కార్లు గిర్లన్నింటినీ ఆరా తియ్య మంటున్నారు. అభ్యర్థి అనుమతి లేకుండా ప్రకటన చేసినా, కరపత్రం ప్రింట్ చేసినా జైలు శిక్ష అట; అనుమతి వుంటే ఎవర్తి పేరుతో ప్రకటన వచ్చినా ఖర్చు అభ్యర్థిదే. ఒక్కొక్క కారుకు నెలకు ఇరవై వేలు ఖర్చుని నిర్ణయించారు. తక్కిన వాటికి ఇదే ప్రకారం రేట్లు నిర్ణయమైనాయి. కలెక్టర్ దెబ్బకు హడలి పోతున్నారు అభ్యర్థులు.

### జపాన్‌కు నెల్లూరు డయాబిటిక్ డాక్టర్

డయాబిటిస్‌లో స్పెషలైజ్‌చేసి, ప్రత్యేక వైద్యుడిగా నెల్లూరులో మంచి పేరు తెచ్చుకున్న డాక్టర్ ఎస్. సత్యనారాయణ మూర్తి 4 తేది జపాన్



వెళ్లారు. జపాన్‌లో పదిరోజులపాటు జరుగుతున్న ఇంటర్నేషనల్ డయాబిటీస్ ఫెడరేషన్ కాన్ఫరెన్స్‌లో ఆయన పాల్గొంటారు. డయాబిటిక్ చికిత్సలో ఆధునిక మెళుకువలు తెలుసుకుని నెల్లూరు రోగులకు మరింత మెరుగైన వైద్య సేవలు చేయడానికి డాక్టర్‌గారికి పర్యటన ఉపకరిస్తుందని ఆశిస్తున్నాము.

## తిరుగుబాట్లు

5 పేజీ తరువాయి

ఇటు జనార్ధనరెడ్డి, అటు మాగుంట వర్గాలతో సంబంధం లేని మాజీ ఎమ్మెల్యే శ్రీ గ్రిద్దలూరు సుందరరామయ్య అల్లూరు సీటు సాధించుకొని రావచ్చుని చెప్తున్నారు. ఆయన జనార్ధనరెడ్డి సహకారం కూడా అభ్యర్థించి వున్నారు కాబట్టి, తుది నిర్ణయంలో ప్రధాని నుంచి ఈ పేరు సూచింపబడితే జనార్ధనరెడ్డి కూడా పెద్దగా అభ్యంతరం చెప్పక పోవచ్చు

అయితే టిక్కెట్లు రాకుంటే తిరుగుబాట్లు అన్న ఆలోచన కాంగ్రెస్ పార్టీకి కాదు, ఆయా నాయకులకు కూడా అనర్థదాయకమౌతుంది. 1989 ఎన్నికలలో వలె ఇప్పుడు కాంగ్రెస్‌కు గాలి అంటూ ఏదీ తోలడం లేదు. ప్రతి కాంగ్రెస్ వాదీ తాత్కాలిక కోపతాపాలు, ముఠా కక్షలు, కార్పణ్యాలు, మర్చిపోయి, జీవన్మరణ సమస్యగా పోరాడితే తప్ప గెలవడం కష్టం. ఏవో ఒకటి రెండు విడిపోతుత వర్గాలు తప్ప, ఇంకెక్కడా కాంగ్రెస్ గెల్పు తీరుతుందని ధీమాగా చెప్పగల్గిన పరిస్థితిలేదు. ఇది తెలిసీ, తిరుగుబాట్లు, స్వతంత్రులుగా పోటీలు అని ఉద్రేకపడితే కాంగ్రెస్ కొంపకు నిప్పు పెట్టినట్లవుతుంది. పివి నరసింహారావుగారు ఈ ప్రమాదం పసిగట్టి, నాయకుల వీపులపై బెత్తం ఆడించవలసిన అవసరం వుంది!

## నెల్లూరు బజారు

మొలగొలుకులు

| | |
|---|---|
| 9672 | 4,000/- |
| 9674 | 4,200/- |
| 5656 | 3,750/- |

### గూడూరు సబార్డినేటు జడ్జికోర్టులో

EPNo. 17/91
O.S.No.19/89

K. Sambandham -వాది(DHR)

Pusala Seethamma -ప్రతివాది(JDR)

#### వేలం ప్రకటన

ఈ నంబరున వాది (DHR) డిక్రీ బాకీ మొత్తం వగయిరాలురాబట్టు కొనటకుగాను యీ దిగువ వివరించబడ్డ షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని 14-11-94తేది న పగలు 10గంటలు మొదలు సాయంత్రం 5 గంటలులోగా పై కోర్టు వారి ఎదుట బహిరంగముగా వేలం జరుపబడునని యిందుమూలంగా తెలియపర్చడ మయినది. వేలం పాటను పాడుటకుగాను, పాటదార్లు పాల్గొన వలసినదిగా తెలియ పర్చడ మయినది

#### షెడ్యూలు

నెల్లూరు రి.డి. తాలూకా వెంకటగిరి స.బు.రి.డి. యిలాకాలో చేరిన వెంకటగిరి టవును, కాశీవిశ్వనాధస్వామి దేవస్థానం వీధిలో తూర్పు వరుసన, డోరునంబరు 10.27 న 108 చ.అడుగులు కట్టుబడిగల పెంకుటిల్లు యిందుకు సంబంధించిన ఖాళీస్థలము, 32చ. గజములు. యిందుకు హద్దులు: తూర్పు కామిశెట్టి క్రిష్ణయ్య శెట్టి గారి ఖాళీస్థలం; దక్షిణం: అడపాలశేషమ్మ గారి యింటికి యీ యింటికి గల జాయింటు మిద్దెగోడ; పడమర: కాశీవిశ్వనాధస్వామి దేవాలయం వారివీధి; ఉత్తరం: కొత్తనూరు మారయ్య యింటికి యీ యింటికి సంబంధించిన జాయింటుగోడ; యీ హద్దులలోపల వివరించబడ్డ 108 చ. అడుగులు కట్టుబడి గల పెంకుటింటి భాగమున్నూ 32 చ.గజములు ఖాళీ స్థలమున్నూ

DHR's విలువ : రూ40,000/-

Amina's విలువ: రూ50,000/-

NB:- యీ నంబరున ప్రతివాది వ్రాయించి యిచ్చియుండు ఆరుమాసం బాకీలు తీర్చి వేలం జరుపబడును.

**Y. RAMA RAO,**
వాది (DHR) తరపు అడ్వకేటు.
గూడూరు.

రాష్ట్ర అవతరణ దినోత్సవ సందర్భంగా నెల్లూరు టి.బి. ఆసుపత్రిలో రోగులకు పండ్లు పంపిణీ చేస్తున్న పోలీస్ కాలనీ యూత్ సభ్యులు, మాగుంట సంస్థల చీఫ్ ఎగ్జిక్యూటివ్ వివి ప్రసన్నరెడ్డి.

## నెల్లూరు సంగతులు

4వ పేజీ కొరవ

శబ్దం చేస్తుండగా కళ్లకు గంతలు కట్టుకొని శబ్దం మాత్రం వింటూ, బాణాన్ని నేలకూల్చిన తీరు ప్రేక్షకులకు ఆశ్చర్యా నందాలను చేకూర్చింది. నిండు వెలుగులో దూరంలో నిలిపిన బంతిని చూచి, హాలంతా చీకటి చేయగా, కటిక చీకటిలో బాణంతో బంతిని పడవేసినప్పుడు హర్షధ్వానాలతో హాలు మార్మోగింది. ఒక కాలితో విల్లును, మరొక కాలితో బాణాన్ని ప్రయోగించి దూరంగా వున్న బంతిని కూల్చడం అబ్బుర మనిపించింది. అద్దంలో చేప ప్రతిబింబాన్ని చూస్తూ దూరంగా వ్రేలాడ దీసిన చేపను బాణంతో కొట్టినప్పుడు అలనాడు మత్స్య యంత్ర భేదనం చేసిన ద్రౌపదీ స్వయంవరం స్ఫురించింది. ఏ ఒక్క అంశంలో కూడా ఈ అద్భుత విలుకాడు అణు మాత్రం గతి తప్పక పోవడం విశేషం.

సభా ప్రారంభంలో ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల విద్యార్థినులు ప్రార్థనా గీత మాలపించారు. అగస్త్యరెడ్డి వెంకురెడ్డి గుంటూరు జిల్లా నరసారావు పేట వాస్తవ్యులైన విలుకాడు మిన్నికంటి వెంకటేశ్వర్లును సభకు పరిచయం చేశారు. డాక్టర్ గోపాల్ రెడ్డి ధనుర్విద్యా దురంధుడ్ని నగదు, నూత్న వస్త్రాలతో సత్కరించారు. వర్ధమాన సమాజ కార్యదర్శి టి.వి. నరసింహాలు స్వాగత, కృతజ్ఞతా వాక్యాలు పలికారు.

### బెజవాడ రామచంద్రా రెడ్డి శతజయంతి వుత్సవాలు

దివంగత బెజవాడ రామచంద్రా రెడ్డి శత జయంతి వుత్సవాలు నవంబర్ 24 న టౌన్‌హాల్‌లో భారీ ఎత్తున జరుప నున్నారు. దీని కోసం డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షతన 100 మంది సభ్యులు గల కమిటీ ఏర్పాటయ్యింది. 30 తేదికి దీని గాను ప్రత్యేక సన్నాహక సమావేశం ఏర్పాటు చేశారు. బెజవాడ వారి రాజకీయ, సాంఘిక సేవలను, వారి చరిత్రను భావి తరాల వారికి తెలియ జేసేందుకే ఈ వుత్సవాలు నిర్వహిస్తు న్నట్లు బెజవాడ పాపిరెడ్డి చెప్పారు. ఈ ఉత్సవాలను మాజీ కేంద్రమంత్రి పి. సుబ్రహ్మణ్యం, జస్టిస్ చిన్నపరెడ్డి, గౌతు లచ్చన్న, ఎం.ఎస్. రెడ్డి, పి. ఉపేంద్ర, ఆగరాల ఈశ్వర రెడ్డి పాల్గొంటారు. రామచంద్రా రెడ్డి జీవిత విశేషాలతో కూడిన 200 పేజీల విశేష సంచికను ఆవిష్కరిస్తారు. రెడ్డి గారి జీవిత విశేషాల పై ఆ రోజు ఛాయా చిత్ర ప్రదర్శన ఏర్పాటు చేయనున్నారు.

### నెల్లూరులో మీడియా సెంటర్ ప్రారంభం

మీడియా సెంటర్‌ను కలక్టరేట్‌లో జిల్లా టెలికం ఇంజనీర్ శారిరాజన్ 31 తేది ప్రారంభించారు. అసెంబ్లీ ఎన్నికల సమాచారాన్ని ఎప్పటికప్పుడు ప్రసార సాధనాలకు అందజేయాలన్న సంకల్పంతో దీన్ని ఏర్పాటు చేశారు. కార్యక్రమానికి అధ్యక్షత వహించిన జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివ రావు మాట్లాడుతూ, దూరదర్శన్, ఆకాశవాణి, పత్రికలు తదితర ప్రసార సాధనాలకు ఎన్నికల సమాచారాన్ని ఎప్పటి కప్పుడు సేకరించి అందజేసేందుకు ఈ మీడియా సెంటర్‌ను ఏర్పాటు చేసినట్లు చెప్పారు. ఎన్నికల కమీషన్ వుత్తర్వుల మేరకు ఈ కేంద్రంలో ఎస్.టి.డి., ఫ్యాక్స్, ఫోన్లు అమర్చారు. ఈ సాధనాలను వినియోగించుకొనే వారు బిల్లు మొత్తం చెల్లించాల్సి వుంటుంది. ఇవే గాక ఈ సెంటర్లో మినీ లైబ్రరీ కూడా ఏర్పాటు చేశారు. అనుమానాలేవైనా తలెత్తినప్పుడు వాటిని తీర్చుకొనేందుకు ఇది వుపకరిస్తుందని కలెక్టర్ తెలిపారు. ఎన్నికల పరిస్థితి ఎప్పటి కప్పుడు సమీక్షించి నిష్పాక్షికంగా యదార్థ సమాచారాన్ని నివేదించే జర్నలిస్టులకు అవార్డు లివ్వాలని నిశ్చయించినట్లు కలెక్టర్ ప్రకటించారు. నివేదికలు సమగ్రంగా సాక్ష్య ధారాలతో వుండాలని; ఎన్నికల్లో అభ్యర్థులు నియమ నిబంధనలు అతిక్రమించడం, పోలింగ్ జరిగే రోజు మాల్ ప్రాక్టీస్‌కు పాల్పడడం వంటి వాటి పై సరైన ఆధారాలు చూపెట్టాలన్నారు. జిల్లా కేంద్రంలో పనిచేసేవారికి, గ్రామీణ ప్రాంతాల్లో పనిచేసే కంట్రిబ్యూటర్లకు వేరు వేరుగా వీటిని ఇస్తామన్నా రాయన. అంటే భారమంతా పత్రికల వారి పై త్రోసి తాము జారుకోవచ్చున్నది కలెక్టర్ గారి ఆలోచన లాగుంది. అధికారులకేం హాయిగా వుంటారు; గ్రామీణ ప్రాంతాలలో పనిచేసే విలేఖర్లకు ఈ వార్తల వల్ల తిప్పలు తప్పవు. కావలి, ఉదయగిరి, వింజమూరుల్లో ఫ్యాక్స్ ఏర్పాటు చేస్తామని శారిరాజన్ చెప్పారు. ఈ కార్యక్రమంలో జె.సి. సతీష్ చంద్ర, డి.ఆర్.ఓ. జి. నారాయణ, పలువురు అధికారులు, పాత్రికేయులు పాల్గొన్నారు.

### జిల్లాలో 27 కోట్లు పొదుపు

సెప్టెంబర్ నెలాఖరు నాటికి జిల్లాలో 27 కోట్ల 43 లక్షల వివిధ పథకాల ద్వారా పొదుపు చేసినట్లు జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర చెప్పారు. ప్రపంచ పొదుపు దినోత్సవం సందర్భంగా 30 తేది జిల్లా పరిషత్ మీటింగ్ హాలులో ఏర్పాటు చేసిన సమావేశంలో ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. కిసాన్ వికాస్ పత్రాల ద్వారా 15 కోట్ల 34 లక్షలు, ఇందిరా వికాస పత్రాల ద్వారా మూడు కోట్ల 51 లక్షలు, పోస్టాఫీసు సేవింగ్స్ ఖాతాల ద్వారా 6 కోట్ల నాలుగు లక్షల రూపాయలు, పోస్టాఫీసు రికరింగ్ డిపాజిట్ల ద్వారా రెండు కోట్ల 54 లక్షల రూపాయలు పొదుపు చేసినట్లు తెలిపారు. దీని వల్ల ప్రభుత్వం నుంచి 50 లక్షల రూపాయలు జిల్లాకు ఇన్‌సెంటివ్‌గా వచ్చిందని; దాన్ని వివిధ అభివృద్ధి కార్యక్రమాలకు ఖర్చు చేసినట్లు జాయింట్ కలెక్టర్ వెల్లడించారు. జిల్లాలో 460 మంది నేషనల్ సేవింగ్స్ ఏజంట్లు, 325 మంది మహిళా ఏజంట్లు, 17 మంది ప్రావిడెంటు ఫండ్ ఏజంట్లు పని చేస్తున్నట్లు చెప్పారాయన. జిల్లా పరిషత్ ముఖ్య నిర్వహణాధికారి వి.ఎస్. విష్ణు మాట్లాడుతూ పొదుపు లక్ష్మి ద్వారా జిల్లాకు మంచి పేరు వచ్చిందని, ఈ సంవత్సరం వెయ్యి గ్రూపులకు డ్వాక్రా పథకం ద్వారా గ్రూపుకు 15 వేల రూపాయల చొప్పున మ్యాచింగ్ గ్రాంట్లు ఇచ్చినట్లు చెప్పారు. ఈ సందర్భంగా జిల్లాలో నేషనల్ సేవింగ్స్ ఏజంట్లుగా పనిచేసి కోటి 13 లక్షల 73 వేల పొదుపు చేయించిన ఎన్.వి. సుబ్బారావు, 98 లక్షలు చేయించిన కె. నిర్మల, మహిళా ఏజంట్లు తులసీ లక్ష్మి, వై. రంగనాయకమ్మలకు జెసి ఇన్‌సెంటివ్ డ్రాఫ్టులు అందజేశారు.

### సర్వే

మొదటి పేజీ కొరవ

అన్ని తరగతుల వారూ ఉన్నారు. తనతో నేరుగా మాట్లాడిన తృప్తితోనైనా వీరందరూ ఢిల్లీ వదలి వెళ్తారని పివి భావన. అందుకే అంత ఓపికగా మధ్యాహ్న భోజనం కూడా మానేసి, ఐదు గంటల పాటు నిలబడి మరీ అంత మందిని కలిశారు. కాని, ఆ తృప్తితో ఇళ్ళకు కదిలిన వారు తక్కువ. దీపావళి రోజు ఉదయం తిరిగి అందులో సగం మంది తన ఇంటి ముందు ప్రత్యక్ష మయ్యేసరికి పివి మండి పడ్డారు. ముందు అందరూ ఇక్కడ నుంచి ఆంధ్రాకు వెళ్ళి ఎన్నికల పనులు చూసుకోండి అని గదమాయించారు.

టిక్కెట్ల నిర్ణయం విషయం పరిశీలించడానికి ప్రధాని ఈ రోజు (4 తేది) పూర్తి సమయం కేటాయించి నట్లు తెలిసింది. ఇతర పనుల న్నింటినీ ప్రక్కన బెట్టి ఆయన జాబితాలు పరిశీలిస్తున్నారని అంతరంగికుల సమాచారం. బహుశా రేపు (5 తేది) సాయంత్రానికి సగం స్థానాలకు అభ్యర్థుల ప్రకటన జరగ వచ్చు. తతిమావి ఆదివారం రాత్రికి పూర్తవుతాయి. 7 తేది నామినేషన్లకు మంచి ముహూర్తమని పలువురు కాంగ్రెస్ వాదులు అనాటికి తమ తమ నియోజక వర్గాలకు చేరు కోవడానికి విమానం టిక్కెట్లు బుక్ చేసు కొంటున్నారు.

కర్ణాటకలో టిక్కెట్ల పంపకం తీరును పరిశీలించిన తర్వాత ఆంధ్రకు కూడా అదే నమూనా నియమావళి వర్తింప జేయడం జరుగుతుందని భావిస్తున్నారు. దీని ప్రకారం పలువురు కేంద్ర, రాష్ట్ర నాయకుల బంధువులు, మంత్రులు, సిటింగ్ ఎమ్మెల్యేలకు నిరాశ ఎదురు కావచ్చు. రాష్ట్రంలో పలుకుబడి కల్గిన ఏ వర్గాన్నీ పెంచడానికి పివి సుముఖంగా లేరు. ముఖ్యమంత్రి, జనార్దన రెడ్డి, వైఎస్ వర్గాలను ఆయన సమ తూకంలో చూస్తారని అంచనా. వీరిలో ఎవరూ ప్రభుత్వాన్ని ప్రభావితం చేయగల సంఖ్యలో ఎమ్మెల్యేలను తమ చేతిలో పెట్టుకొనే పరిస్థితి ఎదురు కాకుండా జాగ్రత్త పడడం పివి అభిమతమని పరిశీలకుల వూహ. 92 లో జనార్దనరెడ్డి ఇంటిలో 135 మంది ఎమ్మెల్యేలు గుమికూడి కొత్త ముఖ్యమంత్రి నియామకంలో తనపై పరోక్షంగా వత్తిడి తేవడాన్ని, ఆ పరిస్థితి నెదుర్కోవడానికి తాను జనార్దనరెడ్డి సిఫార్సు ప్రకారం విజయభాస్కరరెడ్డిని ఎంపిక చేయవలసి రావడాన్ని పివి పదే పదే ప్రస్తావిస్తున్నారట. అట్లని ఆ మూడు వర్గాలను నిర్లక్ష్యం చేస్తే ఎన్నికల్లో పార్టీ గెలుపు కష్ట సాధ్యమని ఆయనకు తెలుసు. వారు క్రుంగి పోకుండా తగినన్ని సీట్లు ఇస్తూనే, ఏ వర్గానికి చెందని, గెల్చే అవకాశం కల్గిన అభ్యర్థులకు పివి అధిక ప్రాధాన్యత నివ్వబోతున్నారు. ఆదివారం రాత్రికి పివి వెలువరించ బోయే అభ్యర్థుల జాబితా విస్మయ కరంగా వుంటుందని భావిస్తున్నారు. ఎవరూ వూహించని పలు ఆశ్చర్యాలు అందులో నిబిడీ కృతమై వుంటాయి.

### ఆచార్య రాళ్లపల్లి

4 పేజీ కొరవ

విభాగంలో 1972లో రీడర్‌గా ప్రమోట్ అయ్యారు. 1979 లో ప్రొఫెసర్‌గా ప్రమోషన్ సాధించారు. 1985లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా కెనడా సందర్శించారు. 1988లో విజిటింగ్ సైంటిస్ట్‌గా మరలా అమెరికాకు వెళ్లారు. 1991లో మూడోసారి అమెరికా సందర్శించారు. 1994 జనవరి-ఏప్రెల్ నెలల్లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా అత్యంత ప్రతిష్ఠాత్మకమైన యూనివర్శిటీ ఆఫ్ బాన్ (జర్మని)లో వున్నారు. శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ జంతుశాస్త్ర విభాగ అధిపతిగా, బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్‌గా, లైఫ్ సైన్సెస్ స్కూల్ డీన్‌గా, హాస్టల్ వార్డెన్‌గా, సెనెట్ సభ్యునిగా సిండికేట్ సభ్యునిగా, పాలనా సంబంధమైన ఉన్నత పదవుల్ని సమర్థవంతంగా, బాధ్యతాయుతంగా, అధ్యాపక, విద్యార్థి వర్గాల అభిమానాన్ని చూరగొనే విధంగా నిర్వహించారు. అనేక జాతీయ, అంతర్జాతీయ సదస్సుల్లో పరిశోధనా పత్రాల్ని సమర్పించి, ప్రముఖులచే 'శెబాష్!' అనిపించుకున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక అవార్డును పొందారు. (1990-91) ప్రతిష్ఠాత్మక ఇండియా నేషనల్ అకాడమీ ఫెలోగా ఎన్నికైనారు. (1988) ప్రతిష్ఠాత్మక నేషనల్ సైన్స్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ ( అలహాబాదు) ఫెలోగా కూడా ఎన్నికైనారు. (1992) వృత్తి సంబంధమైన 26 సంస్థల్లో సభ్యునిగా, కార్యనిర్వాహక సభ్యునిగా, కార్యదర్శిగా, ఉపాధ్యక్షునిగా, అధ్యక్షునిగా, డైరెక్టర్‌గా, వివిధ హోదాల్లో పనిచేశారు. అనేక జంతుశాస్త్ర పరిశోధనా పత్రికలకు సంపాదక వర్గ సభ్యునిగా, ప్రధాన సంపాదకునిగా, కూడా ఉన్నారు. ఎస్.వి.యూనివర్శిటీ పరిధి క్రింద వున్న అనేక అనుబంధ కళాశాలల్ని ఇన్‌స్పెక్షన్ కమీషన్ ఛైర్మన్‌గా సందర్శించి, వాటి పాలకమండలులలో విశ్వవిద్యాలయ ప్రతినిధిగా వున్నారు. యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్ (యు.జి.సి) ప్రతినిధిగా అనేక కమిటీల్లో నియమితులైనారు. ఇతర విశ్వవిద్యాలయాల బోర్డ్సు ఆఫ్ స్టడీస్‌లో, సెలెక్షన్ కమిటీలో సభ్యునిగా పాల్గొన్నారు. విద్యార్థుల అభిమానాన్ని పొందిన అధ్యాపకునిగానే గాక, క్రీడలు, సాంస్కృతిక, శాస్త్రవిజ్ఞాన సంస్థల్లో కూడా కీలక పదవుల్ని సమర్థవంతంగా నిర్వహించి, జాతీయ స్థాయిలో పేరు పొందారు. ఇంత బ్రహ్మాండమైన 'బయోడేటా' కలిగిన రాళ్లపల్లి రామమూర్తిగారికి వి.సి పదవి రావడంలో ఆశ్చర్యమేముంది? అని ఎవరైనా అనుకుంటే మాత్రం అంతకన్న మించిన పెద్ద పొరపాటు ఉండదేమో? ఎందుకంటారా? ఈ వ్యాసం ప్రారంభంలోనే విన్న వించుకున్నట్లు, ఇటువంటి 'కీలక' విషయాల్లో 'రాజకీయ, రాజకీయేతర' అంశాల్ని విస్మరించకూడదు గదా? నమ్రతకూ, నిజాయితీకి మారుపేరైన నూతన ఉపాధ్యక్షులు తిరుపతిలోని పత్రికలవారిని వారిని ఉద్దేశించి ప్రసంగిస్తూ, "ప్రధానమంత్రి నరసింహారావు గారూ, ముఖ్యమంత్రి విజయభాస్కరరెడ్డిగారూ, యు.జి.సి ఛైర్మన్ రామిరెడ్డి గారు" తమ పట్ల "విశ్వాసముంచి, తమకు" అమూల్య సహాయ సహకారాల్ని అందించినందుకు వారికి తమ కృతజ్ఞతాభి వందనాల్ని తెలియ జేశారు. "ధైర్యం లేనిదే సత్యంలేదు; సత్యమే లేకపోతే, మరే యితర సుగుణమూ ఉండదు. అన్న ఆంగ్ల రచయిత మాటల కనుగుణంగా, ఉన్న నిజాన్ని ఉన్నదున్నట్లు మాట్లాడే వ్యక్తిగా రాళ్లపల్లి రామమూర్తి గారు కలకాలం గుర్తుంటారు.

కొత్త వైస్-ఛాన్సలర్ గారు తమకు లభించిన ఈ మహత్తర అవకాశాన్ని విశ్వవిద్యాలయ బహుముఖాభివృద్ధికి సద్వినియోగ పరుస్తారనీ, తాము వాగ్దానం చేసినట్లుగా, బోధన పరిశోధనలతోపాటు, సాంస్కృతిక కార్యక్రమాలతో, క్రీడల అభివృద్ధితో, ఉత్తమ సంస్కార నిలయంగా ఎస్.వి.యూనివర్శిటీలో ప్రగతికి రాచబాట వేస్తారని ఆశిస్తూ తోటి నెల్లూరీయునిగా రాళ్లపల్లి వారికి శుభాకాంక్షల్ని తెలియజేస్తున్నాను.

# సెక్సీ నటనలో తల్లి ప్రక్కనుంటే ఇబ్బంది కదా?

కనక ఉవాయం

తెలుగు ఆడపడుచైన తనకు తెలుగు చిత్రాలు లేనందుకు కనక అనుభవించే బాధ అంతా ఇంతా కాదు. ఎక్కడికెళ్ళినా కనకను అంటిపెట్టుకొని ఉండే ఆమె తల్లి దేవిక "జల్లికట్టుఖానా" అనే తమిళ చిత్రం షూటింగ్‌కు రాకపోవడం చాలా మందికి ఆశ్చర్యం కలిగించింది. 'మీరొక్కరే వచ్చారేంటి?" అని ఒకరడిగితే కనక " ఈ చిత్రంలో హీరో ప్రభుతో నేను చాలా చేరువగా నటించే సన్నివేశాలున్నాయి. అమ్మ చెంత వుంటే అటువంటి సన్నివేశాలలో ఫ్రీగా నటించలేను కదా!. అందుకనే ఈ చిత్రం షూటింగ్‌కు మాత్రం అమ్మ రాకుండా చేశాను. మా అమ్మ, శివాజీ గణేశన్ జంటగా ఎన్నో తమిళ చిత్రాలలో నటించారు. అలాగే శివాజీ కొడుకు ప్రక్కన నేను అంతకు మించిన చిత్రాలలో నటిస్తామేమో- ఈ చిత్రం విడుదలయ్యాక తెలుస్తుంది ". అని అంటున్నప్పుడు ఆమె ముఖం విప్పారింది.

## సినిమా ఎక్కడ తయారైనా 15లక్షలు!

అశ్లీలత, హింస వగైరా అభ్యంతరకరమైన సన్నివేశాలు లేకుండా కుటుంబ సమేతంగా చూదదగిన చిత్రాలకు 15 లక్షల సబ్సిడీ చెల్లింపబడుతుందని ఇది వరకు మన రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ఇలాంటి అత్యుత్తమ చిత్రాలను ఎంపిక చేయడానికి జస్టిస్ పి.చెన్నకేశవరెడ్డి అధ్యక్షుడుగా 26మంది సభ్యులతో ఒక కమిటీ నియమించబడింది. మన రాష్ట్రంలోనే కాకుండా మద్రాసులో గాని, మరెక్కడైనా కాని తయారయ్యే చిత్రాలు కూడా ఈ సబ్సిడీకి అర్హమైనవిగా ప్రభుత్వం స్పష్టం చేసినందుకు చిత్ర ప్రముఖులెందరో తమ హర్షాన్ని ప్రకటించారు.

# ఇళయరాజా, బాలుల మధ్య పొరపొచ్చాలు?

ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం - ఇళయరాజా ఒకర్నొకరు 'ఏరా' అని పిలుచుకునేంత గాఢ మిత్రులు. ఒక విధంగా చెప్పాలంటే ఇళయరాజా అచిరకాలంలోనే ఉన్నత శిఖరాలను అధిరోహించడానికి కారకులైన వారిలో బాలు ముఖ్యుడు. కాని కమలహాసన్‌తో కె. విశ్వనాథ్ దర్శకత్వంలో బాలు నిర్మించే కొత్త చిత్రానికి కీరవాణి సంగీత దర్శకుడు! బాలు సొంత రికార్డింగ్ థియేటర్‌లో జరిగిన, ఆ చిత్రం ప్రారంభోత్సవానికి కూడా ఇళయరాజా రాకపోవడం గురించి రకరకాలుగా అనుకుంటున్నారు!



రాకప్‌డెత్ చిత్రంలో సాయికుమార్

# ఎన్టీఆర్‌కు పరుచూరి ప్రసంగ పాఠం

1983లో తిరుపతిలో జరిగిన 'తెలుగుదేశం' తొలి ఎన్నికల ప్రచార సభకు ఎన్.టి.రామారావు ప్రసంగ పాఠాన్ని రూపొందించిన సినీ రచయిత పరుచూరి గోపాలకృష్ణ చేతనే ఈ మారు కూడా తిరుపతిలో శ్రీకారం చుట్టిన 'శంఖారావం' ప్రసంగ పాఠాన్ని తయారుచేయించినట్లు విశ్వసనీయమైన వార్త!

## టెలివిజన్ ధాటికి సినిమా రేట్లు తగ్గించారు.

బ్రిటన్‌లో మామూలు వీడియో కేసెట్ అద్దె 2 పౌన్లనుంచి 2.25 పౌన్ల వరకు ఉంటుంది. ఈ అద్దె కన్నా 1.50 పౌన్లు తక్కువగా బ్రిటన్‌లోని ఎం.జి.ఎం థియేటర్లలో టిక్కెట్టు ధర తగ్గించబడింది. కొత్త చిత్రాలు కొన్ని వారాలు ప్రదర్శింపబడ్డాకే ఈ తగ్గుదల లండన్, వెస్టెండ్‌లో సినిమా టిక్కెట్టు ఏడు పౌన్లు ఉండగా ఇతర చోట్ల 3 1/2 పౌన్లు ఉంటుంది. ఈ డిస్కౌంట్ పేరు "టేక్‌టూ"! టెలివిజన్‌ల మూలంగా విపరీతంగా దెబ్బ తుంటూన్న సినిమా రంగాన్ని ఆదుకోవడానికే ఈ మినహాయింపు. పోటీకి తట్టుకోలేక మూత పడబోతున్న థియేటర్లను ఎం.జి.ఎం సంస్థ ఈ "టేక్ టూ" పథకానికి ఎంపిక చేసి, డిస్కౌంటుతో సినిమాలు ప్రదర్శిస్తోంది. మనదేశంలో కూడా ఉత్తరోత్తరా ఈ పథకం ప్రవేశపెట్టబడుతుందేమో!

# మా ముగ్గురికీ సెన్సార్ మినహాయింపివ్వాలి!

## - జ్యోతిలక్ష్మి డిమాండ్

కొన్నేళ్ళ గాప్ తర్వాత తాను సినిమా రంగంలో మళ్ళీ ప్రవేశించినా తనకు లభించినన్ని ఛాన్సులు, తన ఒక్కగానొక్క కుమార్తెకు లభించడం లేదని జ్యోతిలక్ష్మి బాధ. " నాలాగే మా అమ్మాయి కూడా సెక్సీ డాన్సులుచేస్తే బిజీ అవుతుందని కొందరు సలహా లిచ్చారు. ఛాన్సు దొరక్కపోయినా ఫరవాలేదు. హీరోయిన్‌గా తప్ప మరే పాత్రనూ మా అమ్మాయి ఒప్పుకోదు." అంది జ్యోతిలక్ష్మి. అర్ధనగ్నంగా కనిపించే దృశ్యాలను ఇటుపైన సెన్సార్ వారు ఆమోదించరన్న ప్రస్తావన వచ్చినప్పుడు" ఇందుకు నేనూ అంగీకరిస్తాను. ఐతే, ఒక చిన్న సవరణ; నేను, డిస్కోశాంతి, సిల్కుస్మిత తప్ప హీరోయిన్‌లు అలాంటి దుస్తులలో కనిపించకూడదని ఆంక్ష విధిస్తే బాగుంటుంది కదా?" అంది నవ్వుతూ.

## అర్జున్ "అగస్ట్ 15"

అర్జున్ ద్విపాత్రలు నిర్వహిస్తూ, ఒక తమిళ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. "మూడు పనులూ ఒకేసారి చేయడం కష్టం కాదా?" అని అడిగితే, "ద్విపాత్రగా ఇద్దరు చేసేపని అయితే, డైరెక్ట్ చేయడం పదిమంది చేసే పనితో సమానం, "అన్నారు అర్జున్. ఆ చిత్రం పేరు "అగస్ట్ 15"; అర్జున్ పుట్టిన తేది కూడా అదే. అతను ఇంతకు ముందు దర్శకత్వం వహించిన చిత్రంపేరు "జైహింద్".

## పనోరమలో తెలుగు చిత్రాల సంఖ్య తక్కువ

1995 భారత చలన చిత్ర పనోరమా విభాగంలో దక్షిణాది నుంచి 38 చిత్రాలు ప్రదర్శింపబడ నున్నాయి. మలయాళంలో 18, కన్నడంలో 9, తమిళంలో 6, గోవా, తుళుభాషలలో తలా ఒక్కొక్క చిత్రం; తెలుగులో 3 చిత్రాలే!

## 'విశు' కు బహిష్కరణ

మధ్యతరగతి మందభాగ్యాన్ని, మందహాసాన్ని తెరకెక్కించడంలో కె. బాలచందర్ శిష్యుడు 'విశు' దిట్ట. "సంసారం-చదరంగం" వంటి ఈయన తమిళ చిత్రాలు కొన్ని తెలుగులో పునర్నిర్మింపబడ్డాయి. ఇటీవల కఠినతరమైన సెన్సార్ నిబంధనలకు నిరసనగా దక్షిణాది తారలు, సాంకేతిక వర్గం జరిపిన ప్రదర్శనలో విశు పాల్గొనలేదు. పైగా, నా చిత్రాలకు సెన్సార్ సమస్య ఎప్పుడూ వుండదు. కుటుంబ సమేతంగా చూదదగ్గ చిత్రాలనే నేను రూపొందిస్తాను గనుక మా నిరసన ప్రదర్శనలో పాల్గొనవలసిన అవసరం నాకు లేదు," అని ప్రకటించారు కూడా. అందుకు కలత చెందిన దక్షిణాది సాంకేతిక వర్గం సంఘం మూడు మాసాల వరకు విశు రూపొందించే చిత్రాలలో తమ సభ్యులెవరూ పాల్గొనరాదని ఆంక్ష విధించింది.

## నమోదు చేయబడిన కొత్త చిత్రాలపేర్లు

అరుణోదయా ఆర్ట్ పిక్చర్స్ "టావెలిచిపొద్దు"; ధనలక్ష్మిచిత్ర "అన్నగారు"; శ్రీ కిరణ్ పిక్చర్స్ "డ్రగ్స్ అండ్ ఎయిడ్స్"; క్లాసిక్ ఆర్ట్ క్రియేషన్స్ "రతివిజ్ఞానం"; లక్ష్మిదేవి కంబైన్స్ 'సుఖ సంసారం"; శ్రీ శివశంకర్ సినీ క్రియేషన్స్ "హలో లవర్స్"; సత్యాప్రొడక్షన్స్ "అందాల ప్రియుడు"; శ్రీ సాయి శాంతి ఎంటర్ ప్రైజెస్ "వగలరాణి"; సబయ మూవీస్ " హాయ్ హాయ్ చిన్నరాజా"; తేజ క్రియేషన్స్ "చిలిపి ప్రియుడు"; ఎల్.వి.ఎస్. ప్రొడక్షన్స్ "పోకిరిరాజా"; సర్కార్ ప్రొడక్షన్స్ " పోకిరిరాజా -పోకిరిరోజా"; ఎస్.బి.ఎస్.ఆర్. ఫిలిమ్స్ "దొంగల్లో దొరగారు"; శ్రీ కల్కి భగవాన్ పిక్చర్స్ "బందిపోటు రాణి"; విజయసాయి ఫిలిమ్స్ "డ్రాకులా"; కృష్ణచైతన్య పిక్చర్స్ "అడవిజంట"; సుమంత్ ప్రొడక్షన్స్ " బస్తీదొంగ"; శ్రీ సాయిరత్న ఎంటర్‌ప్రైజెస్ " దొంగగారు"; సిద్ధివినాయక పిక్చర్స్ "ఖైదీ ఇన్‌స్పెక్టర్"; కృష్ణసాయి కంబైన్స్ "లవ్‌గేమ్"; జగపతి ఇంటర్నేషనల్ 'మెగాస్టార్"; శ్రీ లక్ష్మి శైలజ

కొరవ 11 పేజీలో

# మేడమ్ - మజాగావుంది హాస్యం!

చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

"మేడమ్" మహాను భావురాలు -ఆమె పేరు సరోజిని. ఆమె అసాధ్యురాలు. ఈ చిత్రంలో ముఖ్యపాత్ర వహిస్తుంది. చాలా సమస్యలను పరిష్కరిస్తుంది. మగవాళ్ళు సాధించలేని పనులు ఆడవాళ్లు సులభంగా సాధించగలరన్న సత్యాన్ని రుజువుచేస్తుంది. ఆమె నాలుగు గోడల మధ్య ఇంట్లో కూర్చునే రకంకాదు. ఆడవారికి నాయకురాలై, ఉద్యమాలు నడిపి, అభ్యుదయాన్ని ప్రభోధించి ఆడవారిని మేల్కొలిపి ముందుకు నడిపించిన చైతన్యవంతురాలు. హాస్యం అందించడంలో అందెవేసిన చెయ్యి అనిపించుకుంటుంది. తాను ప్రేమిస్తుంది. ప్రేమించబడుతుంది.

ఇంతకూ ఎవరీ మేడమ్? తీరాచూస్తే ఆమె ఆడ మనిషికాదు. ఆడవేషంలో వున్న మగాడు. ఒక మగాడు ఆడవేషంలో మేడమ్‌గావుండి అచ్చం ఆడమనిషిలా నటించవలసిన అవసరమేమొచ్చింది?

ప్రసాద్ (రాజేంద్రప్రసాద్) అనే యువకుడు కార్టూన్ చిత్రాల్లో కార్టూన్ బొమ్మలకు మాటల డబ్బింగు చెప్తూ బ్రతుకు సాగిస్తుంటాడు. బాబీ అనే శ్రీమంతుడు(శుభలేఖ సుధాకర్) ప్రసాద్ స్నేహితుడు. బాబి, కల్పనను (శ్రీలత) ప్రేమించాడు. పెళ్ళిచేసుకోవాలను కుంటాడు. కాని కల్పన ప్రసాద్‌ను ప్రేమిస్తుంది. ఇది ఇలా వుండగా బాబి నాయనమ్మకు (జానకి) తీవ్రంగా జబ్బు చేస్తుంది. తాను పెళ్లి చేసుకోబోయే అమ్మాయిని చూచి హాయిగా చనిపోతానని నాయనమ్మ కోరుతుంది. అందు మీదట బాబి వేడుకోవటంతో ప్రసాద్ ఆడవేషం వేసుకొని బాబికి కాబోయే భార్యగా , నాన్నమ్మకు కనిపిస్తాడు. మేడమ్ అందచందాలు, వినయ విధేయతలు చూచిన నాయనమ్మ బాబికి మంచి అమ్మాయి భార్య కాబోతున్నందుకు ఆనందిస్తుంది. ఆసంతోషంతో చావటం మాని బ్రతుకుమీద ఆశ పెంచుకుంటుంది. మేడమను బాబీకిచ్చి పెళ్లిచేసే ప్రయత్నాలు సాగిస్తుంది.

ఆ తర్వాత ప్రసాద్ మేడమ్‌గానే కొనసాగవలసి వస్తుంది. ఒక ఫోటో గ్రాఫర్ (నగేష్) ఈమెను ప్రేమించి వెంటబడతాడు. తాను ప్రేమించిన కల్పనతో స్నేహం పెరగటం, ఆమెతో హాస్టల్ రూంలో క కలిగి వుండడం వంటి ఎన్నో హాస్య సన్నివేశాలు మేడమ్ సృష్టిస్తుంది. కడుపుబ్బా నవ్విస్తుంది.

అలాగే మేడమ్‌లాగే కొనసాగితే కల్పనను పెళ్లిచేసుకోవటం జరగదు కాబట్టి, మేడమ్‌ను లేకుండా చెయ్యడం అవసరం. అందుగ్గా ఒక కారును లోయలోకి త్రోసెయ్యడం; ఆ కారు ప్రమాదంలో మేడమ్ చనిపోయిందని అందరూ అనుకుంటారు. కాని మేడమ్ చావదు. ఆమె తన ఆడవేషం మాని ప్రసాద్‌గా వేషంలోకి వచ్చినా మేడమ్ ప్రేక్షకుల మనసుల్లో బ్రతికే వుంటుంది. అదే ఆ పాత్రలోని విచిత్ర సృష్టి లేని

కొరవ 11 పేజీలో

## జనవాణి

3వ పేజీ కొరవ

శకునులు అయిన దుష్ట చెరి దుర్యోధనుడి గతి పట్టించాలని చూస్తున్నారు. ఆ వాస్తవాన్ని అయన గ్రహిస్తే మంచిది.

జలదంకి -నిమ్మపల్లి శ్రీనివాసులు.

### మంచివారిని ఎన్నుకోవాలి

పదవ అసెంబ్లీని ఎన్నుకునేందుకు ఇక నెల రోజులు గడువుంది. శేషన్ పుణ్యమా అని ఎన్నికల్లో హడావుడి జాస్తిగా కనపడుతున్నది. రాజకీయ పార్టీలకు వాటి అభ్యర్థులకు వెన్నులో జ్వరం కాస్తున్నది. శేషన్ నిబంధనలు ఖచ్చితంగా అమలైతే ఎన్నికలు సజావుగా జరిగిపోతాయి. ఈ ఎన్నికల్లో అభ్యర్థులు కులాన్ని, మతాన్ని వాడకుండా చూడాలి. దేవాలయాలు, మశీదులు, చర్చిల నిర్మాణాల వాగ్దానాలపై కన్నేసి వుంచాలి. ఓటర్లు మద్యపానలోలురు, శీలహీనులైన అభ్యర్థులను ఎన్నుకోకుండా జాగ్రత్త పడాలి. స్వల్ప ప్రలోభాలకు లొంగకుండా వ్యక్తిగత శీలత వున్న అభ్యర్థులనే ఎన్నుకోవాలి.

నెల్లూరు -వాస్తురామచంద్ర.

**NOTICE**

Before Motor Accidents claims Tribunal (District Judge) Nellore

IA No. 144/94
OP No. 609/91

APSRTC Rep by its Managing Director -Petioner

Vs

1. SK. Chand Basha
2. UnitedIndia Insurance Co .Ltd., -Respondents
3. NarayanaReddy -Proposed party 3 rd Respondnts

Proposed party 3rd Respondent Address.

To ·

B. Narayana Reddy, Lorry Owner
(Lorry bearing registration No. AAN 8589)
S./o. Rami Reddy, Arunachalam . Street, , StoneHouse pet, Nellore.-

పై నంబరువ APSRTC BUS No. AEZ 5394ను మీ లారీ AAN 8589నంబరుగల లారీ APSRTC BUSను డామేజి చేసినందున కోర్టులో APSRTC వారు OPని దాఖలు చేసియున్నారు. IANo144/94 in OP 609/91లో మిమ్ములను Proposed party గా చేర్చియున్నారు. ఈ పిటిషన్ విషయమై మీకు ఎటువంటి ఆక్షేపణలు ఉన్నయెడల వాయిదా 9-11-94 తేదిన మీరుగాని, మీ ఖుద్దున గాని, లేదా వకీలుద్వారా గాని ఆక్షేపణలు ఉన్నయెడల పై కోర్టులో ఉదయం 10.30 గంటలకు దాఖలు చేసుకొనవలెను. లేని యెడల మీ పరోక్షములో పై కేసు తీర్మానించ బడును.

యం. రామచంద్రారెడ్డి
పిటిషనర్ అడ్వోకేటు, నెల్లూరు.

### రాజకీయ నాయకుల తీరేవేరు!

ఎన్నికల ముందర వాగ్దానాలు చేయడం, అపరిచితులను కూడా పలకరించడం రాజకీయ నాయకులకు పరిపాటి. గెలిచిన తర్వాత ప్రజలకు కనపడనే కనపడరు. తాబేదార్లు, అనుచరులకు తప్ప, వేరేవారికి పనిచేసి పెట్టరు. ప్రజలు పనుల కోసం పై వారిలో ఎవరినో ఒకరిని ఆశ్రయించాలి. ఏ పార్టీ నాయకులైనా అంతే. గెల్చిన వారు పై పదవి ఆరాటంలో, లక్షలకు లక్షలు సంపాదించే యావలో పడిపోతారు. తిరిగి చూసుకునేసరికి ఐదేళ్లు గడిచిపోతాయి. ప్రజలు మళ్లీ కొత్త వాళ్లకు పట్టం కడతారు. వాళ్లూ అదే బాటన సాగిపోతారు. ప్రజా సంక్షేమాన్ని కాంక్షించే నాయకులే ఈ రోజుల్లో కరువై పోతున్నారు.

నెల్లూరు -ఎస్.వి.యస్. స్వరూప్.

### టీచర్ పోస్టులు భర్తీ చేయాలి!

ఇటీవల టీచర్ పోస్టులకు జరిపిన వ్రాత పరీక్షల ఫలితాలను ప్రకటించమని హైకోర్టు తీర్పు ఇచ్చినందున వెంటనే ఫలితాలు ప్రకటించాలి. వేలాది టీచర్ పోస్టులు ఖాళీగా వుండడం వల్ల గ్రామీణ ప్రాంతాల్లో పిల్లల చదువు పుట్టెక్కింది. ఎందరో నిరుద్యోగులు వుద్యోగాలకోసం ఎదురు చూసి, చూసి అలసి పోయి వున్నారు. ఎన్నికలను అడ్డంపెట్టుకుని వీటిని ఆపడం తగదు. ఎన్నికల తర్వాత వచ్చే ప్రభుత్వం ఎటువంటి నిర్ణయాలు తీసుకుంటుందో అన్న భయం ప్రతిఒక్కరిలో వుందికాబట్టి ఈ ప్రభుత్వమే పోస్టుల భర్తీకి తగిన చర్యలు తీసుకోవాలి.

సంగం -పోట్ల శ్రీహరి.

### క్రిమినల్ బాగుంది- సమీక్షబాగాలేదు!

జమీన్‌రైతులో 'క్రిమినల్' చిత్రం గురించి వ్రాసిన సమీక్ష బాగోలేదు. అది చదివాక సమీక్షకుడు నిజంగా సినిమా చూశారా అనిపిస్తుంది! ఆయన వ్రాసినంత హీనంగా ఆ సినిమాలేదు. ప్రేక్షకుల్ని విసిగించి బయటకు పంపుతుందని హెడ్డింగ్ పెట్టడం పరమ దారుణం. మరో సినిమా పత్రిక శివరంజనిలో దర్శకుడు మహేష్‌భట్, నాగార్జున, మనీషాకోయిరాల, నాజర్‌ల నటన అద్భుతమని వ్రాశారు. క్లాసికల్ పిక్చర్ అని శ్లాఘించారు.

పొదలకూరు -నాగార్జున యువశక్తి.

### తీవ్రవాదంపై రణభేరి మోగించాలి!

శ్రీలంక అధ్యక్ష ఎన్నికలలో ప్రతిపక్ష అభ్యర్థి దిస్సనాయకే మానవ బాంబు ఘాతుకానికి బలికావడం అత్యంత విషాదకరం. ఈ సంఘటన స్వర్గీయ రాజీవ్ గాంధీ హత్యోదంతాన్ని మళ్ళీ గుర్తుకు తెచ్చింది. ఈ పేలుడులో 60మంది మరణించగా 300 మందికి పైగా గాయపడ్డారని. ఇందుకు తమిళ తీవ్రవాదులు బాధ్యులని అంటున్నారు. ఎల్.టి.టి.ఇ కి ప్రభుత్వానికి అడపా, దడపా చర్చలు జరుగుతున్నా కూడా నరమేధం సాగుతూనే వుండడం విచారకరం. తీవ్రవాద సమస్యకు పరిష్కారం కన్పించక శ్రీలంక నేల రక్తంలో తడిసి ముద్దయి పోతున్నది. ప్రజాస్వామ్య వ్యవస్థలను సవాలు చేస్తున్న తీవ్రవాదంపై ప్రపంచ దేశాలు సమైక్యంగా రణభేరి మోగించాలి.

కోవూరు -వి.ఎస్.సత్యనారాయణ.

### దినదిన ప్రవర్ధమాన మౌతున్న ఎయిడ్స్!

ఆసియాలో ఎయిడ్స్ మహమ్మారి శరవేగంతో విస్తరిస్తోంది. ఆగ్నేయాసియా ప్రాంతంలో ఎయిడ్స్ కేసుల సంఖ్య 30వేల నుంచి రెండున్నర లక్షలకు పెరిగాయన్న వార్త బెంబేలెత్తిస్తున్నది. వ్యాధి గ్రస్తుల్లో 40 శాతం మంది మహిళలు కావడం వల్లనే ఎయిడ్స్ తామరతంపరలా వ్యాపిస్తోందని నిపుణులంటున్నారు. దక్షిణాసియా ప్రాంతంలో ఇప్పుడిప్పుడే వర్తక వాణిజ్యాలు అభివృద్ధి చెందుతున్నాయి. ఈ దశలో ఎయిడ్స్ మహమ్మారి చెలరేగిపోతే ఇక్కడి ప్రభుత్వాలు దిక్కు తోచని స్థితిలో పడిపోతాయి. కాబట్టి ఈ దేశాలన్నీ కలిసి సమష్టి వ్యూహం రచించాలి. ప్రపంచ ఆరోగ్య సంస్థకూడా ఈ ప్రాంతంలో వ్యాధి నిరోధక చర్యలకు ప్రత్యేక వ్యూహాన్ని అమలు చేస్తే మానవకోటి రక్షింపబడుతుంది.

గూడూరు -కె.హరిప్రసాద్.

### మాగుంట సేవాసంస్థను స్థాపించాలి!

రాజకీయ నాయకుల మాటలు విని రాజకీయాలలో దిగి పొరపాటు చేశారు మాగుంట సుబ్బరామిరెడ్డిగారు. ఆయన స్వయం కృషితో వ్యాపారం చేసి కోట్ల రూపాయలు సంపాదించారు. దానికి తగిన విధంగానే త్యాగ బుద్ధితో స్నేహితులకు, తెలిసినవారికి ఎంతో కొంత సహాయం చేస్తున్నారు. మంచినీటి సరఫరా, శవ . వాహనం పదిమందికి వుపయోగ పడుతున్నాయి. ఇటీవల ఆయన బల ప్రదర్శనలతో రాజకీయాలవైపు మొగ్గుచూపించడం ఆయన స్థాయికి తగినట్లులేదు. రాజకీయాల్లో మునుపు ఆయన అన్నిపార్టీల, అన్నివర్గాల ప్రజల గౌరవం పొందేవారు. అందువల్ల ఆయన పునరాలోచించి రాజకీయాలకు స్వస్తిచెప్తే రాయలసీమ సేవాసమితి వంటి సేవా సంస్థ స్థాపించి నిర్వహిస్తే ప్రజలమన్ననలు పొందు తారు. పదికాలలపాటు కీర్తి చిరస్థాయిగా వుండిపోతుంది.

నెల్లూరు -ఎ.రుక్మిణమ్మ.

### వెన్నుపోటు

అఖరిపేజీ కొరవ

గొతులచ్చున్న వంటి కాకలు తీరిన నాయకులు ఒక్కొక్కరే పార్టీని విడిచి బయట పడ్తున్నారు. బహుజన సమాజ్ రాష్ట్రశాఖ కాన్షీరామ్ వర్గం, సత్యమూర్తి వర్గంగా చీలిపోయింది. బహుజన సమాజ్ పార్టీ టిక్కెట్ల పంపిణీ అంగడి అంతా తెరవలేదు. బహుజన సమాజ్ పార్టీకూడా దాదాపు అన్ని స్థానాల్లో కూడా అభ్యర్థుల్ని రంగంలోకి దించవచ్చు. ఈ పార్టీకి 20 శాతం వరకు సరైన రాష్ట్ర నాయకత్వం లేకపోవడం, జిల్లాల వారీగా ఎవరికి వారే అన్నట్లు కార్యకర్తలు వ్యవహరిస్తుండడంతో వచ్చే ఎన్నికల్లో బహుజన సమాజ్ పాత్ర ఎలావుంటుందో ఊహించుకోవచ్చు.

### దీపాలు వెలగాలి

-జయంపు కృష్ణ

మనిషి మనిషిలో
మనసు మనసులో
కరుడు గట్టిన కటిక చీకటి
కాలిపోవాలి, కరిగి పోవాలి-
మనిషి నడకలో
మనసు నడతలో
ఎదిగిపోయిన వెర్రి స్వార్థం
అంతరించాలి, అణిగిపోవాలి-
మనిషి బతుకులో
మనసు మడతలో
కలిసిపోయిన కులమతాలు
దించివేయాలి, తుంచి పోయాలి-
మనిషి మాటలో
మనసు బాటలో
కల్మషాలు, కార్పణ్యాలూ
కాలరాయాలి, నేలరాయాలి-
మనిషి శ్వాసలో
మనసు ఆశలో
విశ్వమానవ స్వేచ్ఛాకాంక్ష
పురులువిప్పాలి,
మరులుకురియాలి-
మనిషి మదిలో
మనసు గదిలో
జాతి అంతా ఒక్కటేనని
భావ మెదగాలి, భవితచూడాలి-
మనిషి డెందం
మనసు అందం
అందరినీ అలరించునట్టుల
ఆవరించాలి, ఆవహించాలి-
మనిషి మనసులో
మనసు పొరలలో
భారతీయత ప్రజ్వలించి
పూలు పూయాలి, దీపాలు
వెలగాలి-

### మిత్రులకు పచ్చచొక్కాల శాపనార్థాలు

తెలుగు దేశం పార్టీ మిత్రపక్షాలైన సిపిఐ, సిపిఎం, జనతాదళ్ పార్టీలను తెలుగు తమ్ముళ్ల శాపనార్థాలు వేధిస్తున్నాయి. మొత్తం 39 స్థానాల్లో మిత్రపక్షాలు తమ అభ్యర్థుల్ని రంగంలోకి దించాయి. అందులో సుమారు 20 స్థానాల్లో తెలుగుదేశం అభ్యర్థులు తీవ్ర నిరాశకు లోనయ్యారు. రొటేషన్ పద్ధతిలో ఈసారి టిక్కెట్లు తీసుకోవాలన్న తెలుగుదేశం సూచనను మిత్ర పక్షాలు అంగీకరించకపోవడంతో తెలుగు తమ్ముళ్లు భంగ పడాల్సి వచ్చింది. ఈమారు ఎలాగైనా మిత్ర పక్షాలను ఓడిస్తే తప్ప వచ్చే ఎన్నికల్లో అయినా తమకు టిక్కెట్లు దక్కవన్న అభిప్రాయంతో 'దేశం' తమ్ముళ్లు కారాలు మిరియాలు నూరుతున్నారు. దీనితో మిత్ర పక్షాలకు దిక్కు తోచడంలేదు.

### 50 ఏళ్ళ క్రితం

కనిపించలేదనీ వార్త. 7 గురు కూతుళ్లట.

చల్లాయపాళెం: శ్రోత్రియందారు చర్య శ్రుతి మించి రాగాన బడుతున్నది. గ్రామస్తులు అనాదిగా మంద బైలు వగైరా సాముదాయక ప్రయోజనాలకు వుపయోగ పెట్టుకుంటున్న యిసుక దిబ్బలను యీ సంవత్సరంమళ్ళదోలడం, పోలీసు రిపోర్టు చేయడం చూస్తే ఇదంతా రైతులను అనవసరంగా కయ్యానికి కాలు దువ్వ డంగా కనిపిస్తుంది. ఇంతా రైతులను బాధ పెట్టి లంగ దీసుకొని అనాదిగా రైతులను భవిస్తున్న జిరాయితీ హక్కును భగ్నపరచడానికి యిత్తు, శ్రోత్రియందారు ఏజెంటు, వారి అల్లుడు, గ్రామ మునసబు, ఒకే వ్యక్తి కావడం వల్ల ప్రాధాన్యం రైతుల మీద ధ్వజమెత్తడానికి ఆస్కార మౌతున్నది. రైతులకు, శ్రోత్రియం దారుకు చట్టరీత్యా ఏర్పడ్డ భేదాలను యీ గ్రామమునసబు వ్యక్తి ద్వేషాల క్రిందకు మారుస్తున్నాడు. తన పేరు మీదుగా తన యేజంటు ఈలాంటి అక్రమాలు జరుపుతుంటే శింగరాజా వెంకట సుబ్బారావు గారి వంటి పెద్ద వారు తలకాయ వూచడం యేలాటి సబబు గాదు, అధికార్లు యీ అక్రమాలను అపుదురు గాక.

### వైద్యం

కార్తీక మాసం వస్తే కమ్మలు జేయిస్తా నన్నాడట పెళ్ళాంతో ఒక వైద్యుడు. అంటే కార్తీక మాసంలో వ్యాధులు జాస్తిగా వుంటవి. వైద్యులకు పది పావులు దొరకత వన్నమాట. కాబట్టి శాస్త్ర కారుడే మన్నాడో తెలుసా?

కార్తీక బహుళ పక్షమున్నూ, మార్గశిర శుద్ధ పక్షమున్నూ. యివి రెండూ యముని యొక్క రెండు దంష్ట్రలనీ, ఈ రెండు పక్షాల్లో ఎవడు మితంగా భుజిస్తాడో వాడు ఆరోగ్యంగా ఉంటాడని భావం.

అందులోను ముఖ్యంగా
కార్తీకస్య దినాన్యష్టౌ
అష్టౌ వా గ్రహణస్యచ
యమదంష్ట్రా సమాఖ్యాతా:
స్వల్పభుక్జీహ జీవతి
- శార్ఙ ధరసంహిత

అధమం కార్తీక మాసంలో చివర 8 దినాలున్నూ, మార్గశిరంలో మొదట 8 దినాలున్నూ, యముని యొక్క రెండు దంష్ట్రలనీ. ఈ పక్షం దినాలైనా స్వల్పంగా భుజించిన వాడు ఆరోగ్యంగా వుంటాడనీ అర్థం.

కావున 2.11.44 నుండి 2.12.44 వరకు అనారోగ్య దినాలు గాన యీ మాసం రోజాలు తిండి తగ్గించి తినమని శాస్త్రకారుడంటాడు.

## వాస్తవికతను తీసి గట్టున పెడితే మనసారా నవ్వుకోవచ్చు

# మగరాయుడు

చిత్రసమీక్ష
అల్లూరు రహీం

ఒక తరహా చిత్రం విజయ వంతమైతే అదే మూసలో సినిమాలు తీయడం తెలుగు సినిమాకు పట్టిన జాఢ్యాలలో ఒకటిగా చెప్పొచ్చు. సోషియో ఫాంటసీ ఫార్ములాతో తీసిన యమలీల చిత్రం హిట్టయ్యాక, అదే మూసలో పెక్కు చిత్రాలు నిర్మిత మవుతున్నాయి. ఆ కోవలో విడుదలైన రెండవ చిత్రమే ఇ.వి.వి. సత్యనారాయణ తీసిన మగరాయుడు. వాస్తవికత అన్న ఆలోచనను రెండున్నర గంటలు తీసి గట్టున పెడితే దర్శకుడు, కథా, మాటల రచయితలు, నటీ నటుల సమష్టి కృషికి ప్రేక్షకులు ఖచ్చితంగా నవ్వి తీరాల్సిందే. దీని కోసం క్రియేట్ చేసిన సన్నివేశాలే అటువంటివి. కంప్యూటరైజేడ్ యమలోకం, ఫ్లాపీలలో పాపుల చిట్టా, ప్రమాణ స్వీకారం రోజు దున్నపోతు మొరాయించడంతో యముడు లేట్‌గా రావడం తమాషాగా వుంటాయి. అటువంటివే శివుడు తెలుగు, ఇంగ్లీషు మిక్స్ చేసి మాట్లాడడం; బరన్‌లిగ్ శాస్తికి తెలుగు టి.వి. కార్యక్రమాలు చూసే శిక్ష విధించడం; అల్లు రామలింగయ్య ఆత్మలో కార్తీక్ ఆత్మ ప్రవేశించి 'చికు బుకు రైలే' స్టైయిల్‌లో అల్లరి చేయడం.

అక్కడక్కడా దర్శకునికి, మాటల రచయితలకు సమన్వయం కుదిరినట్లు లేదు. హంతకుడు జిన్నా చనిపోయినట్లు 'ఆంధ్రజ్యోతి' పత్రికలో వచ్చిన వార్తను శివుడు చూపిస్తానే మళ్లీ అదే పేపర్ పేరు చెబుతూ మరో పేపర్ విసరడం; బాబా గ్యాంగ్ చంపాలను కొన్న లిస్టులో డిజిపి, డిఐజి, ఎస్‌పిలు వున్నారంటూ అందరూ ఎస్‌పిలను చంపుతున్నట్లు చూపడం స్క్రీన్‌ప్లే లోపమే. స్టార్ ఇమేజ్‌ను దృష్టిలో పెట్టుకొని తీసిన మగరాయుడు గెటప్‌లో విజయశాంతి ఇమడలేదు. కారా కిల్లీ పాటలో అయితే మరీ ఎబ్బెట్టుగా తోస్తుంది. స్టాండ్ బై హీరో కార్తీక్ పాటల వరకే పరిమిత మయ్యాడు. చిత్రం ఖ్రియడంలో దర్శకుడు కష్టపడ్డా స్టార్ ఇమేజ్ కొంత వరకు ఈ చిత్రాన్ని 'డామేజ్' చేసి సత్యనారాయణను హిట్ లక్ష్యాల నుండి క్రిందికి ఈడ్చింది.

కథను పరికిస్తే బాబా గ్యాంగ్ తమ వ్యాపారాలకు అడ్డు తగులుతున్న పోలీస్ అధికారులను అంత మొందించాలని పథకం రచిస్తుంది. దీని కోసం హంతకుడు జిన్నా (విజయ రంగరాజా) ను రంగంలోకి దింపుతారు. తొలి ప్రయత్నంలోనే జిన్నా గాయపడడం డాక్టర్ సుధారాణి (విజయశాంతి) వద్దకు ట్రీట్‌మెంట్‌కు రావడం జరుగుతుంది. డాక్టర్ అక్క పిల్లలను కిడ్నాప్ చేసి బెదరించి జిన్నా మరణించినట్లు డెత్ సర్టిఫికెట్ పొందుతుంది బాబా గ్యాంగ్. యమలోకంలో ఆకస్మిక రైడ్ జరిపిన శివుడు (మల్లికార్జున రావు) మరణాల లిస్టులో జిన్నా లేకున్నా భూలోకంలో పేపర్లలో అతను మరణించినట్లు వచ్చిన వార్తలు చూసి మండి పడతారు. అండర్ గ్రౌండ్‌లో వుండే జిన్నా కోసం వెతుక్కొంటూ భూలోకం వస్తారు యముడు (కోట శ్రీనివాస రావు), చిత్రగుప్తుడు (బాబూమోహన్), ఎస్.ఐ. (బ్రహ్మానందం) సలహా మేరకు 'మే ఐ హెల్ప్ యూ' సంస్థ నడిపే కార్తీక్ (కార్తీక్) ను కలసి జిన్నా అప్పగింతకు 3 లక్షల కాంట్రాక్టు కుదుర్చు కుంటారు. జిన్నా ఆచూకీ తెలుసు కోనేందుకు డాక్టర్‌తో ప్రేమ నాటకం ఆడతారు కార్తీక్. జిన్నా బ్రతికున్న విషయం తెలుసు కోనేసరికి యముడి సీట్ కోసం చిత్రగుప్తుడు పొడిచే వెన్నుపోటు చదరంగంలో జిన్నాకు బదులుగా కార్తీక్ చనిపోతాడు. తన వునికి మార్చుకోను జిన్నా ప్లాస్టిక్ సర్జరీ చేయించుకొని ఆ విషయం ఎక్కడా వెల్లడి కాకుండా డాక్టర్ సుధారాణిని హతమారుస్తాడు. చిత్రగుప్తుని మ్యాజిక్ తెలుసుకొన్న యముడు కార్తీక్ ఆత్మను సుధారాణి బాడీలో మగరాయుడుగా పంపి పని చక్క దిద్దాలను కొంటాడు. నానా హంగామా జరిగాక అసలు పని జరుగుతుంది. చివరలో భూలోక హంతక ముఠా నరకంలో నరమేధం సృష్టించను రెడీ అయినప్పుడు ప్రత్యేక ఛానల్‌లో చూసిన శివుడు తన బెటాలియన్‌తో వచ్చి పరిస్థితి చక్కదిద్దడంతో చిత్రం పరిసమాప్త మవుతుంది.

రమణి - మల్లిక్ కలసి వ్రాసిన కథకు పోసాని కృష్ణ, మురళి వినయ్ హాస్యరస గుళికల వంటి మాటలం దించారు. 'తలకులేని నొప్పి అమృతాంజనానికి ఎందుకు' 'ఓర్నీ.... యమా' వంటి చమత్కార విరుపులు మాటల్లో కనపించాయి. ముఖ్యంగా శివుడు, యముడు, చిత్రగుప్తుడు, కామెడీ నటులు బ్రహ్మానందం, అలీ, శాస్త్రి, అల్లు రామలింగయ్య, ఎ.వి.ఎస్. కోసం సృష్టించిన కొన్ని మేనరిజాలు చూస్తే నవ్వాపు కోలేం. భువనచంద్ర, సీతారామ శాస్త్రి రాసిన పాటల్లో 'బల్ భలే గుండి భామా' 'జారీ పైటమ్మా నీకు వందనాలు' లకు రాజ్‌కోటి చక్కని బాణీలిచ్చారు. తార, ప్రభుల నృత్యం కూడా వీటికి అందంగా అమరింది. యమలోకం వంటి భారీ సెట్టింగులను చోటా కె. నాయుడు కెమెరా చక్కగా చిత్రీకరించింది. రవీంద్ర బాబు ఎడిటింగ్ చక్కగా చేయబట్టే ప్రేక్షకులు చిత్రం చూస్తూ ఎంజాయ్ చేస్తారు తప్ప బోర్ ఫీల్ కారు. విజయశాంతి నటన అక్కడక్కడా అతిగా తోస్తుంది. పౌరాణిక పాత్రలో కోట శ్రీనివాస రావు, బాబూమోహన్ జంట తమకు తిరుగు లేదని పించారు. అల్లు రామలింగయ్య 'యంగ్ స్టైల్' నటనతో తనకు ఎప్పుడూ పోటీ లేదని చాటారు. అలీ, బ్రహ్మానందం చక్కని కామెడీ పండించారు. సోషియో ఫాంటసీ చిత్రాలను ప్రజలు ఆదరించరని 'మగ్గరాయుడు' ద్వారానైనా కొందరు నిర్మాతలు గ్రహిస్తే సినిమా రంగాన్ని సంక్షోభం నుంచి గట్టెక్కించిన వారవుతారు.

## మేడమ్ 9 పేజీ తరువాయి

దాన్ని వున్నట్టు శాశ్వతంగా నిల్పడం. ఈ చిత్రం దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు కథతానే వ్రాశారు. సినిమాల్లో ప్రయోగాలు చెయ్యడంలో శ్రీనివాసరావు ఆరితేరిన దర్శకుడు. తాజాగా మేడమ్ వినోద ప్రయోగం చేశారు. చిత్రాన్ని ప్రయోగాత్మకంగా, ప్రయోజనాత్మకంగా తీర్చిదిద్దారు. అంతేకాదు చిత్రాన్ని హాస్యరస భరితం చేశాడు. మేడమ్‌పాత్ర రూపకల్పనే ఒక హాస్య వల్లరి. మగాడు మేడమ్‌గా మారడం, మరలా మేడమ్ మగాడుగా మారడమే హాస్యానికి పునాది అవుతుంది. ఆ ప్రక్రియమీద అల్లిన సన్నివేశాలు హాస్యం కుమ్మరించాయి. సురేష్ కెమెరా మేడమ్‌ను చాలా అందంగా వివిధ భంగిమల్లో చూపింది. చిత్రంలో ఫోటోగ్రాఫర్ మేడమ్ అందాలకు మురిసి ఆమెను పెళ్ళాడేందుకు చేసిన ప్రయత్నాలు. ఫోటో గ్రాఫర్‌గా హాస్యనటుడు నగేష్ అందించిన ఆనందం, కల్పనతో మేడమ్ హాస్టల్ రూంలో గడపడం మేడమ్ ఆడవాళ్ళతో కబడి ఆడడం, ఒక దేవాలయంలో ఆరు స్థలాల్లో ఆరు పెళ్లిపీటల మీద మేడమ్ కూర్చోవలసి వచ్చే దృశ్యం. ఇంకా కొన్ని దర్శకుని హాస్య సృష్టికి నిదర్శనాలు. మేడమ్ పాత్రలో రాజేంద్ర ప్రసాద్ నూటికి నూరుపాళ్లు ఆడమనిషిగానే జీవించాడు. ఆ కదలికలు, ఆ చూపులు, ఆ ఆడమాటలు, ఆ వలపు, ఆ వయ్యారం, అచ్చుగుద్దినట్లు మారాడు రాజేంద్రప్రసాద్. ఆడమనిషిగా మాటలను తానే ఆడగొంతుతో మాట్లాడాడు. ఒక పాటకూడా తానే పాడాడు. ''మహిళా ఇక నిదురనుంచి మేలుకో'' అనే పాటను మాత్రం మేడమ్‌కోసం ఆడగొంతుతో యస్.పి. బాలసుబ్రహ్మణ్యం సహజంగా సుందరంగా పాడాడు. మాధవపెద్ది సత్యం సంగీతం వేటూరి, జొన్నవిత్తుల, భువనచంద్ర వ్రాసిన పాటలకు కమ్మదనం కూర్చింది. శుభలేఖ సుధాకర్, సౌందర్య, జానకి, లతాశ్రీ, చక్కగా నటించారు. కొన్ని సన్నివేశాలు ముఖ్యంగా కల్పన పెళ్ళి విషయాల్లో, మేడమ్‌కు మూడు నిశ్చితార్థాల సన్నివేశాల్లో శ్రీరాం మాటలు గొప్పగా వున్నాయి.

## శ్రీశ్రీ వర్సెస్ రాకెట్

-'రసిక్

నెత్తురు క్రక్కుకుంటూ కదలిని నేరాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరు-
నిప్పులు చిమ్ముకుంటూ నింగికి నెగిరిపోతే
నిబిడాశ్చర్యంతో వీరె-
అంటున్న మన శ్రీహరికోట నిన్నటి నేటిరాకెట్లు
అరె, మహాకవి గేయాన్ని తలక్రిందులుచేసి
అప్పగించడంలేదు కదా అదమరిచి?
లేదు, లేదు.
శ్రీశ్రీ వాపోయినది వ్యక్తి జీవితాన్నిగూర్చి
రాకెట్టు వాకొంటున్నది శాస్త్రప్రగతిని గూర్చి
మానవజీవిత గమనంలో ఉత్థానం వెనుకపతనం
శాస్త్రపురోగమనంలో పతనాన్ని వెన్నంటి ఉత్థానం.

## సినిమా 9 పేజీ తరువాయి

మూవీస్ ''డేరింగ్ హీరో''; కృష్ణచైతన్య పిక్చర్స్ ''యమలవ్''; తేజస్విని క్రియేషన్స్ 'యంగ్‌హీరో'; రూపకళా మూవీస్ ''గ్లామర్‌కింగ్''; గ్రేట్ ఇండియా ఫిలిమ్స్ ''డిసెంబర్ 31''; పాబాబు ఫిలిమ్స్ ''బిగ్‌బ్రదర్''; ఆర్.జి.ఆర్. క్రియేషన్స్ ''లేబర్''; సరాక్‌మూవీస్ ''ది సిటీ''; సృజనా ఫిలిమ్స్ ''టైగర్'';హర్షిణి ఫిలిమ్స్ ''గన్‌మాన్''; శ్రీ బాలు ఆర్ట్ క్రియేషన్స్ ''హలో అల్లుడూ''; స్నేహచిత్ర ''ఖబడ్దార్''; మారుతి సినీ ప్రొడక్షన్స్ ''మిస్టర్‌మాయ''; రోజా కమర్షియల్స్ ''టైమ్‌బాంబ్''; శ్రీ శారద మూవీస్ ''రుద్రతాండవం''; విజయతేజ కంబైన్స్ ''మోహిని పిశాచి''; శ్రీ కల్కి

సినిమా పేర్లలో కొన్ని పైన పేర్కొనబడ్డాయి.

మండలిలో సభ్యులైన వారెవరైనా కొంత రుసుము చెల్లిస్తే టైటిల్స్ రిజిస్టర్ చేసుకోవచ్చు. పై చిత్రాలలో కొన్నిటికి పేర్లు ఆంగ్లంలో ఉన్నాయి. కొన్ని చిత్రాలు అసలు ప్రారంభింపబడవు కూడా. కొన్ని ప్రారంభించినా పూర్తికావు. కొన్ని పూర్తయినా విడుదలవవు. కొన్ని విడుదలైనా విజయవంతమయ్యేవి వేళ్ళమీద లెక్కించవచ్చు. పై లిస్టు చూస్తుంటే తెలుగు సినిమా -రంగం మూడు పువ్వులూ ఆరు కాయలూ చందాన వున్నట్లు కనిపిస్తుంది కదూ?

# అన్ని పార్టీల్లో వెన్నుపోట్లకు కత్తులు నూరే వారే!

కాంగ్రెస్ పార్టీలో కలహాలు కొత్తగాక పోయినప్పటికీ ఈమారు ముఖ్యమంత్రి ఒంటెద్దు పోకడ కారణంగా ముఖ్యమంత్రికి దాదాపు అన్ని వర్గాలూ దూరమయ్యాయి. ముఖ్యమంత్రి వర్గీయులకు టిక్కెట్లు దక్కకుండా ఎన్నికల కమిటీలో ముఖ్యమంత్రి వైరి వర్గాలు కాయశక్తులా ప్రయత్నిస్తున్నాయి. ముఖ్యమంత్రి జాబితాలో ఎక్కువమంది 'రెడ్డి' కులస్తులు వుండడంతో, రెడ్లను తగ్గించి బి.సి.లకు టిక్కెట్లు ఇవ్వాలని వై.ఎస్. ద్రోణంరాజు, హనుమంతరావులు కొత్త వివాదం

## 50 మంది సిటింగ్ ఎమ్మెల్యేలకు ఉద్వాసన?

లేవదీసి ముఖ్యమంత్రిని ఇరకాటంలో పడేశారు. కాంగ్రెస్ స్క్రీనింగ్ కమిటీ సగం స్థానాలలో కూడా ఏకాభిప్రాయానికి రాలేకపోయింది. చివరకు బంతిని ఏఐ కోర్టులో వేసి అభ్యర్థుల నిర్ణయాన్ని ఆయన అభిమతానికే వదిలేశారు. ఎంపీలు కూడా తమ అసెంబ్లీ నియోజక వర్గాల్లో ప్రత్యేకంగా అభ్యర్థుల్ని సూచిస్తూ జాబితాలు సమర్పించడంతో కాంగ్రెస్ టిక్కెట్ల గొడవ ముదిరింది.

కర్నాటకలో దాదాపు 25శాతం సిట్టింగ్ ఎమ్మెల్యేలకు టిక్కెట్లు దక్కలేదు. అదే ఫార్ములా మన రాష్ట్రానికి కూడా వర్తింపజేయడం దాదాపు ఖాయంగా కనిపిస్తోంది.

ఒకవేళ అదే జరిగితే సుమారు 50 మంది ఎమ్మెల్యేలు వీధిన పడాల్సి వస్తుంది. కాంగ్రెస్ పార్టీలో ప్రస్తుతం వున్న కుమ్ములాటలకుతోడు టిక్కెట్లు రాని ఎమ్మెల్యేల అసంతృప్తి కూడా పార్టీ విజయావకాశాలపై ప్రభావం చూపవచ్చు. పాత కాంగ్రెస్ పార్టీలోని గ్రూపుల మధ్య ఈసారి ఎన్నికల్లో వెన్నుపోట్లు తప్పేట్లు లేవు.

నెల్లూరు జిల్లాలో ముఖ్యమంత్రి ఆశీస్సులతో మాగుంటవారు నేదురుమల్లి జనార్ధనరెడ్డిపైన, ఆయన అభ్యర్థులపైన కత్తులు దూయడం ఖాయం. రాయలసీమలో ఈసారి కాంగ్రెస్ వర్గాలు వీధిరౌడీల మాదిరిగా రక్తపాతం సృష్టించే ప్రమాదం కనిపిస్తోంది. ముఖ్యమంత్రి కోట్ల, ఆయన ప్రధాన ప్రత్యర్థి వైఎస్‌కూడా రాయలసీమకు చెందిన వారు కావడంతో కాంగ్రెస్ వర్గాలు రెండుగా చీలిపోయి కయ్యానికి కాలుదువ్వుతున్నాయి. అవిగాక స్థానిక ముఠాతగాదాలు కూడా ఈసారి ఎన్నికల్లో కాంగ్రెస్‌కు మైనస్‌పాయింట్ కావచ్చు.

### 'దేశం'లో అసంతృప్తి సెగలు

ఎన్నడూ లేని విధంగా ఈమారు తెలుగుదేశం పార్టీలో నిరసనలు, అసంతృప్తి, ముఠాలపోరు తారా స్థాయికి చేరింది. ఆ పార్టీలో అల్లుళ్లకుతోడు ఎన్టీఆర్ అర్ధాంగి లక్ష్మీపార్వతి కూడా గ్రూపు కట్టడంతో సహజంగానే తెలుగుదేశంకు కాంగ్రెస్ కల్చర్ అంటువ్యాధివలె సోకింది. నిన్నమొన్నటిదాకా అధినేత ఎన్టీఆర్ కళ్ళెర్రచేస్తే వణికిపోయే తమ్ముళ్లు ఇప్పుడు ఎన్టీఆర్‌తోనే నేరుగా తలపడుతున్నారు. టిక్కెట్ల విషయంలో ఎన్టీఆర్ చొక్కాపట్టుకున్నంత పని చేస్తున్నారు. టిక్కెట్లు ఆశించిన అభ్యర్థులు తమకు టిక్కెట్లు రాకపోతే మద్దతు దారులతో ఎన్టీఆర్ నివాసానికి వచ్చి అధినేతను బండబూతులు తిడుతున్నారు. పార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు మాజీ ఎంపి మింటె పద్మనాభం తనకు టిక్కెట్టు రాకపోవడంతో సమావేశంలోనే ఎన్టీఆర్‌ను విలదీశాడు. ఆ తర్వాత పార్టీకి రాజీనామా చేసి రామారావు విధానాన్ని, పార్టీలో నెలకొన్న ముఠా తగాదాల్ని పత్రికల వారితో ఏకరువు పెట్టారు. కాపు కులానికి చెందిన మింటె రాజీనామా కోస్తా జిల్లా కాపుల మనోభావాల్ని దెబ్బతీసే అవకాశముంది. కాగా సిట్టింగ్ ఎమ్మెల్యేల్లో ఏడుగురికి రామారావు ఎగనామం పెట్టారు. అందులో కృష్ణా జిల్లా అవనిగడ్డకు చెందిన మాజీ మంత్రి సింహాద్రి సత్యనారాయణ, అనంతపురం జిల్లాకు చెందిన మాజీ మంత్రి నాగిరెడ్డి వున్నారు. వీరిరువురికీ నియోజక వర్గాల్లో మంచి పేరుంది. రాజకీయాల్లో నీతి నియమాలకు

## లక్ష్మీపార్వతి జోక్యంతో దేశంలో ముష్టియుద్ధాలు

వీరిద్దరూ పెట్టింది పేరు. సింహాద్రి కృష్ణాజిల్లా కాపునేత, నాగిరెడ్డి అనంతపురం జిల్లాలో పెద్దరెడ్డి. వీరిద్దరికి ఎన్టీఆర్ కావాలనే టిక్కెట్లు ఎగేశాడు. అనంతపురంలో మాజీ నక్సలైటు పరిటాల రవికి పెద్దపీట వేయడంతో నాగిరెడ్డి చాలాకాలం నుంచి తన అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు. అలాగే కృష్ణాజిల్లా 'దేశం' అధ్యక్షుడు అంబటి బ్రాహ్మణయ్య లక్ష్మీపార్వతి ప్రోత్సాహం చేస్తుండటంతో సింహాద్రికి టిక్కెట్టు దక్కలేదు. నిజామాబాద్ జిల్లా బోధన్ ఎమ్మెల్యేను కాదని బాబూఖాన్‌కు టిక్కెట్టివ్వడం ఆ జిల్లాలో 'దేశం'కు పెద్ద మైనస్ పాయింట్ అయింది. టిక్కెట్ల కేటాయింపులో అల్లుళ్లతోపాటు లక్ష్మీపార్వతి కూడా పోటీ పడడంతో దాదాపు అన్ని జిల్లాల్లో కూడా 'దేశం' ముష్టియుద్ధాలు మొదలయ్యాయి.

### కాన్షీరామ్‌కూ తప్పని అసమ్మతి

బహుజన సమాజ్ నేత కాన్షీరామ్‌కు కూడా అసమ్మతి పోటు తప్పలేదు. మాజీ నక్సల్ నాయకుడు సత్యమూర్తికి కాన్షీరామ్‌కు ఉప్పూ-నిప్పు మాదిరిగా వుంది. ఫ్యూడల్ సంస్కృతి నరనరాన జీర్ణించుకున్న కాన్షీరామ్ తమతో సంప్రదించకుండానే పార్టీ పరమైన కీలక నిర్ణయాలు తీసుకుంటున్నారని సత్యమూర్తి బహిరంగంగానే ధ్వజమెత్తారు. కాన్షీరామ్ వల్ల ప్రభావితులై పార్టీలో చేరిన

కొరవ 10వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,